# సీతావనవాసము

దువ్వూరు రామిరెడ్డిచే రచియింపఁబడి

ప్రకటింపఁబడినది





మద్రాసు

ండియా ప్రింటింగు ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1921

 [వెల 1—2—0

శ్రీ

# సీతావనవాసము



మఘ్ర్వారు రామరెడ్డిచే రచియింపఁబడి
ప్రకటింపఁబడినది.

మద్రాసు
ఇండియా ప్రింటింగు ముద్రాక్షరశాలయందు
ముద్రితము.
1921

 [వెల 1—2—0

# విన్నపము

ఉత్తరరామాయణకథను వస్తువుగాఁగొని మహాకవి భవభూతి ఉత్తరరామచరితమను పేర నొక యద్భుతమైన నాటకమును రచియించెను. ఆనాటకముయొక్క ప్రాశస్త్యము "ఉత్తరేరామచరితే భవభూతిర్విశిష్యతే" అను పండితవాక్యమే చాటుచున్నది. ఆనాటకమును అయిదుగురారుగురు కవులు తెలిగించిరి. మునుమున్నే మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు తెలిగించిరి. ఉత్తరరామచరిత్రమును స్వతంత్రముగ నాటకములు రచియించిన కవులెందరోగాని, బళ్లారి వయ్యాకరణులు కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచియించిన "లవకుశ" అను నాటకముమాత్రము ప్రచురింపఁబడినది.

మహాకవి భవభూతి మార్గాశ్రయించినకథను నేనును ఆశ్రయించి స్వతంత్రముగ నాటకమును రచియించుటకు నా సామర్థ్యమునకన్న సాహసమే మూలము. కవులయందు సిపాటిగుప మన్నింపఁదగినది. అట్లుగాకయున్న స్వతంత్రరచనకు మార్గములవడదు.

మహాకవి యొకకథను నాటకముగ రచియించిన వెనుక, మఱియొకకవి ఆకథనే గ్రహించి నాటకము రచియించుటకు గసనగతములగు విషయములు వదిలిపెట్టఁబడి యుండునాయని ప్రశ్నింపవచ్చును. ఇందుకు నేఁజెప్పవలసిన సమాధాన మొకటికలదు. ప్రతికవికిని ఇతరులచే ననుకరింపరాని ప్రత్యేకగుణము, దాయ, పరిణామ పరిపాకముల ననుసరించి కొద్దిగనో గొప్పగనో యుండును. కవులు సృజించువారు. వారి ప్రతిభానిర్మిత ప్రపంచ మెంతకొలఁది పెరుగుచుండునేగాని యింకిపోదు. రామణీయకము సృజింపఁబడుకొలఁది భావప్రపంచము విశాలమగుచుండునేగాని సంకుచితముగాదు. ప్రతిమానవుఁడును సౌందర్యపూజనమున కర్హుఁడని నానమ్మకము. ఈనాటకములోని గుణాగుణవిమర్శనము రసజ్ఞులగు సహృదయుల విశాలభావములకు వదలిపెట్టితిని.

నెల్లూరుజిల్లా కోవూరుతాలూకా పెమ్మారెడ్డిపాలెం వాస్తవ్యులును మాకు దగ్గరిబంధువులును యశోభిలాషులును కవితాభిజ్ఞులును అగు మ॥రా॥శ్రీ॥ కోవూరు వెంకటసుబ్బారెడ్డిగారు ఈనాటకమును భాషాభిమాన సూచకముగ ముద్రింపించినందులకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

20-4-1921.
మద్రాసు.

ఇట్లు, శిష్యుఁడు
ముప్పూర్వారు రామరెడ్డి.

శ్రీ

# సీతావనవాసము

---

## నాంది

శా. శ్రీవైదేహియుఁ బుత్త్రకుల్ కుశలవుల్ సేవింప, సౌమిత్త్రి భ
క్త్యావేశమ్మున ఛత్త్రమెత్త, నిరుచామర్ల్ నిల్చి వీచోపులన్
వైనంగాలవణారియున్ భరతుఁడున్, భద్రాసనాసీనుఁడై
యీవిశ్వంబును నేలు రాముఁ డిడు మీ కిష్టాయురారోగ్యముల్.

---

# ప్రథమాంకము

## (1) రంగము లంక.

శూర్పణఖ.

శూర్ప:—ఆహా! కాలవైషమ్యము! దానవేశ్వరుఁడగు పేరోలగంబుండు సభామంటపమున సాలీడులు గూళులల్లుచున్నవి. సకల సామంతమహీకాంతుల కైవారములకు మాఱు గుడ్లగూబల కర్ణకఠోరములగు రావములు వినవచ్చుచున్నవి. ఔరా! రాజధానిదుస్థితి!

సీ. సురసిద్ధసాధ్య కిన్నర యక్షగంధర్వ రాజులకును డాయ రానిలంక!
పన్నగాశనపక్ష పరిభవసంపాది యంభోధి పరిఖయై యలరులంక!
మేరుకోదండు గర్వార శౌర్యంబైనఁ గరఁగించువీరులఁ గన్నలంక!
అభ్రంకషోత్తుంగహర్మ్యగోపురవైభవమున నాకము సిగ్గుపఱచులంక!

తే-గీ. ప్రళయ రుద్రార్క చండ విభ్రాజితేజుఁ
డైన దశకంఠునకు రాజధాని లంక
నేఁటి కెట్లాయె—నక్కటా! నేలమట్ట
మాయె దుష్టదైవము మాకు దాయ యౌట.

మ. అరిపాదంబులుపట్టి దాసుఁడయి దైత్యవ్రాతముం బోరిలోఁ
బరిమార్పించి సహోదరాదుల మృతిన్ భాగ్యంబుగా నెంచు ము
ష్కరుఁడై నేఁడు విభీషణాసురుఁడు లంకారాజ్య మేలంగ సి
గ్గఱియుచ్చో నివసింపఁగావలెనె యింక న్నీచపుం గూటికిన్.

వనంబునఁ గందమూలఫలాదులు లేవా యీపాడుపొట్ట నించికొనుటకు? ఆఁడుదాన నయ్యు రాక్షసకులంబున దశకంఠునకు సోదరినై జనియింపలేదా? (ఉలిక్కిపడి యాకసమువంకఁ జూచి) ఆహా! గగనమార్గమున దైతేయవీరులు నాకన్నులకుఁ బొడకట్టుచున్నారు. పోటుగంటులనుండి దొరఁగు ఒక్కొక రక్తపూరమును ఒక్కొక నాలుకకు ప్రతిహింసాపరాయణత్వము నుపదేశించుచున్నది.

మేఘనాదాది మహోత్సిపులారా! నా ప్రతిజ్ఞ వినుడు.

శా. మీరెల్ రాక్షసవీరయోధులు బలామేయ ప్రభావైక దు
ర్వారుల్ పోరుల నేనరాంగినను నైసర్గంబ భక్షించి యు
న్నారో యాంధరణి కుమారు లాసమానన్ బొందిశోకార్తయై
ఘోరారణ్యములన్ దినాథలై మిము యొగ్గింబొందఁ గల్పించెదన్.

(ఆశ్చర్యముతో) ఏమిది! వారంతలో అదృశ్యులైరి. ఇదియేమి మనోభ్రాంతియా? స్వప్నమా? లేక సత్యమైయుండునా? నన్ను ప్రతిహింసకుఁ బురికొల్పుటకై పరలోకవాసులు నాకు దర్శన మిచ్చియుందురు కాఁబోలు.

రాముని మోసగించి తనచేతనే సీతను గాంతారములఁ ద్రోయించి అనృపతి గోడుగోడని దుఃఖింప నేను పకపకనగి నిలింపలోకవాసులగు మాబంధుసందోహము నహా! శూర్పణఖా! యని నన్నభినందించునప్పుడుగదా నాజన్మము కృతార్థమగుట! నేఁడే నేనయోధ్యకుఁబోయి పూర్వాలోచిత కల్పనాక్రమంబున సమయమువేచి పగతీర్చుకొనియెద! (నిష్క్రమించును).

## 2. రంగము వనము.

### సీత యాత్ర.

సీత.—గృహారామపరిసరము లతిక్రమించి నిసర్గరమణీయమగు నీ వనోపాంత దేశమునకు వచ్చితిమి.

ఊర్మి.—అక్కా! చాల యలసితివని మొగము చెమ్మరంపిలినది.

తే-గీ. కడప దిగలేని నిర్భర గర్భవతివి
చారు సుమకోమలవు ప్రయాసమున కోర్వ
వెంత చెప్పిన వినక వనాంతరమున
కింత దవ్వేల నడువంగ నిగురుబోఁడి.

సీత.—వనాలోకన కుతూహలము నన్నింతదూరమె లయించినది.

ఊర్మి.—అత్తగారి సాహసము వినిన—

సీత.—ఏమీ

ఊర్మి.—మనల నిద్దఱను గోపింతురు.

సీత.—ఆత్మవినోదార్థము ఇందుల విహరించుచుంటిమి.

ఊర్మి.—అట్లయిన గమనాయాసము లేదా?

సీత.—ఇపుడిపుడు దోఁచుచున్నది.

ఊర్మి.—ఇఁక మరలుదమా?

సీత.—ఇంచుకసేపీ వెన్నెల తాలతిన్నెపై విశ్రమించి యంతఃపురమున కేఁగుదము. చెల్లెలా, మార్గపరిశ్రాంతము లగు నా యవయవముల కీ చందమామవలె సుఖాశ్లేష మమృత లేపనమువలె నున్నది.

చ. జిలిబిలి కమ్మఁదేనియల చిత్తడి జాఱుచుఁ బుప్పొడిక్ నని
తలముల రాల్చుచుం గుసుమతల్పములం బొరలాడుచుక్ ధునీ
సలిలతరంగ డోలికల సంతతమూఁగుచు శీతలంపుఁ గాఁ
గిలుల మదంగకంబుల సుఖింపఁగఁ జేయు మరుత్కిశోరముల్.

ఊర్మిళా! గృహారామములకన్న ఈవనాంతరములు రమణీయములుగ నున్నవి.

ఉ. చాలుగ మార్గ పార్శ్వతరుశాఖలఁ బుష్పిత వన్యవల్లులు
య్యాలల పోలికం గదలి యాడ మయూరము లెక్కి కూయుచుం
గేళిఁ జరించుచుండి తోసికింపగఁ దీవలనుండి క్రొంబువుల్
రాలిన నేలయంత నవరత్నమయంబుగఁ గాంతులీనెడిన్.

ఊర్మి.—అక్కా! పదునాలుగేఁడులు దండకారణ్యమున నివసించిన నీకు క్రొత్త మారామవాటిక లింపుగొలుపునా? అచ్చటి నిర్ఝరములు, అచ్చటి తరుగణ సంతానములు, అచ్చటి నానామృగపక్షిసందర్శనములు ఇచ్చట లభించునా?

సీత.—చెల్లెలా! దండకారణ్యమన్నంతనే నా యొడలెల్ల గగురెత్తుచున్నది

తే-గీ. దండకారణ్య వాసంబు దలఁచినంత
హర్ష శోకానుభవము పెల్లగ్గలించు
వనవిహారము తాపస జనుల మైత్రి
రాక్షస విరోధమట మాకుఁ బ్రాప్తమాట.

ఊర్మి.—అక్కా! గడచినది గదా యారణ్యవృత్తాంతము.

సీత.—అయినను అందనుభవించిన సుఖదుఃఖావస్థలు మఱపునకు వచ్చునవియా? జనస్థానమునఁ బదునాలుగువేల కించురథముల రక్కసులతో నసహాయశూరుఁడయి పోరి, వారినుక్కడంచిన ఆర్యపుత్రుని శౌర్యమూర్తి నేఁడు దర్శించినటులఁ బొడకట్టుచున్నది.

క. ఖరదూషణాది దైత్యో
త్కరముల నరుమాడి సుశరధారలు దొరఁగన్
శరజక్షతములఁ గాంతుఁడు
నలరెను కింశుకము పూతపట్టిన యటులన్.

ఊర్మి.—అక్కా,- శూర్పణఖాపరిభవానంతరము గదా ఈ సమరము జరిగినది.

సీత.—అవునవును. ఆ దానవి కడుమాయలమారి పిసాళిజంత.

క. "నిను మ్రింగెద"నని యసురాం
గన శ్రీరాముని లక్ష్యించి ఘనఘోషమునన్
ననుదరియరాఁగ సగజు
పనుపున సౌమిత్రియుఁడు దానిఁబరిభవ పఱచెన్.

ఊర్మి.—ఆ రక్కసికి మంచి శాంతి పూజయే జరిగినది.

సీత.—ఊర్మిళా! యా దైత్యాంగనయే గదా నా యపహృతికి మూలము!

ఊర్మి.—(ఆశ్చర్యవిషాదములతో) ఏమీ, దాని యకార్యమా యది యంతయు!

సీత.—చెల్లెలా! కాలము గానప్పుడు అమృతముగూడ విషమగుచుండును. ఆ బంగారుజింక యెంతపని చేసినది.

తే-గీ. కనకమయమైన హరిణంబు గఱికె బయలఁ
గేళ్లు దాఁటుచుఁ గొమ్ములు గీటకొనుచుఁ
జిక్కి చిక్కక యల్లంతఁ జేరి బెదరి
చూచు మురిపెంబు చిత్తంబు సొచ్చి విడదు.

సీత.—(స్వగతము) స్వప్నమునందువలె నవస్థాంతరము పొందితిని. (ప్రకాశముగ) ఆర్యపుత్రుఁడా విహారమునకై యిచ్చటికి విచ్చేయుటేల ?

రాము.—(చిఱునవ్వుతో) నేనడుగఁ దలఁచిన ప్రశ్న నీవే యడిగితివా ? మఱి సముచిత్తుఁడ నీ సహచారిణను. ధర్మాసనము వీడి యంతిపురంబున కేఁగితిని ; అయ్యది ప్రియాశూన్యమగుట హృదయాహ్లాదకవస్తువు నన్వేషించుచు నింతదూరము వచ్చితిని

సీత.—ఆః దాక్ష్యహాసము చెప్పినను అభ్యాసము వాసనారూపముగ నున్నది కాఁబోలు.

రాము.—(చిఱునవ్వుతో) కావుననే గర్భాలసవయ్యు వనముల వినోదించుట.

సీత.—(సిగ్గుతో) ఆర్యపుత్రునకే ఋణపడితిని.

ఊరి.—అక్కా ! సంధ్యాపూజకు కుసుమములు కోసికొనివచ్చెదను. (పువ్వుల బుట్టతో నిష్క్రమించును.)

సీత.—(స్వగతము) నామనోభీష్టము నెఱింగింతునా ?

రాము.—ప్రేయసీ, యేమొ తలపోయుచున్నట్లున్నావు.

సీత.—ఏమియు లేదు

రాము.—జానకీ, నీవు నాబహిఃప్రాణవవుగదా, మనకిద్దఱకు నన్యోన్యమెఱుంగరాని రహస్యము లుండునా.

సీత.—రహస్యము గాదు. నాకొక యభిలాష గలదు. భాగీరథి పరిసరాటవుల నివసించు తాపసకన్యకల స్నేహానుబంధము నన్నీడ్చుచున్నది.

రాము.—ఇదుకా యింత శంకించుచుంటివి.

సీత.—ప్రాణవల్లభా, మునికన్యకలతోఁ బ్రొద్దుపుచ్చుచుండిన యాదినములు నేనెట్లు మఱతును.

మ. గిరిసానుస్రుతనిర్ఝరీతటములం గ్రీడింపగాఁ బోయి సాం
ధ్యరాగారంజిత పశ్చిమాశఁగల చిత్రంబుల్ విలోకించుచున్
సరసాలాపము లాడికొంచు ఋషికన్యల్ నేను సంతోష ని
ర్భరచిత్తంబులఁ బుచ్చినట్టి దినముల్ భావంబుఁ బ్రేరేచెడిన్.

రాము.—కాంతా, నిండుపున్నమనాఁటి రేయి నీవును అరణ్య బాలికలుఁగూడి యాడుచుండ.—

సీత.—చాలుచాలు ఆర్యపుత్రుని వినోదము.

రాము.— తే-గీ. గాంగపరిసరవల్లీ కుసుమములను
దాపసాంగనలీవ్వను దాఁగియుండి
నవరేఖుంగక పొదరింట నేనుసొచ్చి
సింహగర్జలమిమ్ము వంచింపలేదె.

సీత.—ముగ్ధములైన తాపసకన్యకల లేడుచూపులు ఆగస్త్యపుత్రున కామెత్తైనవి కాఁబోలు.

రాము.—సీతా, యాదినములు మఱచినను మఱపురావు.

సీత.— ప్రాణవల్లభా, ఆవనప్రదేశములు మఱొకమాఱు దర్శించి వత్తము.

రాము.—అట్లనే పోవుదము లెమ్ము.

సీత.—[స్వగతము] ధన్యను.

రాము.—ఇఁక నంతఃపురమున కేఁగుదము.

తే-గీ. పశ్చిమాద్రికి డీకొని పగులువాఱి
యర్కుఁడను నావ సాంధ్య రాగాబ్ధియందు
నల్లనల్లన మునుగంగ నాయుదంత
మవనిఁ దెలుపంగ నవఁ బక్షులఱచి పఱచు.

సీత.—ఊర్మిళా.

ఊర్మి.—ఇదిగో వచ్చుచున్నాను.

(అందరు నిష్క్రమింతురు.)

---

# ద్వితీయాంకము

---

## 1. రంగము సభామంటపము.

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు వశిష్ఠనవార్షి.

వశి.— రామచంద్రా, ఋశ్యశృంగమహర్షి యజ్ఞదీక్షవహించి మనకు నాహ్వానపత్రిక నంపియున్నాఁడు.

రాము.—విషయము వినిపింపుఁడు.

వశి.—జానకి యాపన్నసత్త్వ; దూరప్రయాణాయాసమున కోర్వఁజాలదు. రామచంద్రుఁడు సీతావినోదార్థ మచ్చటనే నిలువఁగాక. కౌసల్యాదిమహాదేవులును

లక్ష్మణ భరత శత్రుఘ్నులును వశిష్ఠాది ఋషీశ్వరులును తక్కిన బంధుమిత్రులును దర్శనార్థము విచ్చేయఁ బ్రార్థితులు.

రాము.—మునీంద్రా మాతావగారి సీతాపత్నిపాతమువలన యజ్ఞసందర్భన పరితాపములనుండి తొలఁగింపఁ బడితిని. మునిపుంగవులెల్లరు యాగమంటపము నలంకరించి ఋత్విక్పుంగవమహర్షిని కృతకృత్యుని గావింపుఁడు.

వశి.—వత్సా! సవనమన్నఁ దాపసులకుఁ బండువుగదా.

రాము.—భరతా ప్రయాణసన్నాహము లొనరింపుము.

భర.—ఆజ్ఞానువర్తిని. (నిష్క్రమించును).

(మునులు ప్రవేశింతురు.)

మునులు.—త్రైలోక్యభద్రా! రామభద్రా! దీనశరణ్యా! రక్షింపుము, రక్షింపుము.

రాము.—మునీంద్రులారా! స్వాగతము.

లక్ష్మ.—ఋషిపుంగవులారా! యభివాదనములు.

శత్రు.—తాపసులారా! వందనములు.

వశి.—రామరాజ్యమునఁ గుశలమేగదా తాపసోత్తములకు?

మునులు.—ఇవిగో మాకుశలప్రత్యయములు. (వస్తువులుంతురు).

శత్రు.—(నిరూపించి) ధగ్నకుండలములే యివి.

లక్ష్మ.—ఇవి త్రుటితాక్షమాలికలు; ఇవి వల్కలాజినఖండములు- ఋషీశ్వరులారా! ఏల యీ తాపసవస్తుప్రదర్శనము?

ముని.—(కోపముతో) గతిలో దుష్కృత్య గ్లావశేష తాపస వస్తుప్రదర్శనమనిన సార్థకముగనుండును.

రాము.—ఏమి యీవిపరీతము.

వశి.—రామరాజ్యముననుగూడ రాక్షసబాధయా?

లక్ష్మ.—రాక్షసుల గర్వమింకను శేషించియున్నదా?

రాము.—మునీంద్రులారా! యీ యాసనములపైఁ గూర్చుండుఁడు.

1 ముని.—రాజా, మాకేల యీ యాసనములు?

2 ముని.—రామచంద్రా, మేమిప్పుడే గోడ కుర్చీలుగూర్చుండి దిగివచ్చితిమి.

3 ముని.—మహారాజా, మాగడ్డముల పీచుత్రాళ్ళతో గుదియఁగట్టఁబడి కేయూంబవలు కదలమెదలలేక కుంచితాంగులమయి, పుణ్యవశమున విడిపింపఁబడిన మాకు నిలుచుండుటయే సౌఖ్యము.

రాము.—అయ్యో యెంతకష్టము.

శత్రు.—ఔరా! రాక్షసాధముల దుష్కార్యములెట్లు మేర మీఱుచున్నవి!

రాము.—మునీశ్వరులారా! మిమ్ము చీకాకుపఱచిన రాక్షసాధముఁ డెవఁడు?

1 ముని.—మహారాజా, యీ రాక్షసుని పేరు దలఁచినంతనే యీదురాత్ముని భయంకరస్వరూపము మాకు ప్రత్యక్షమగుచున్నది

వశి.—పాపము! రాక్షసపీడితులీ ఋషీశ్వరులు.

2 ముని.—

మ. హిమవత్పర్వత సానుభాగమున గౌరీశుం దపోనిష్ఠ మో
దమునొందించి విరోధి వీరనికరధ్వంసోగ్ర మౌ శూల రా
జమునార్జించి తదాది తాపసుల నాశంబే వ్రతంబట్లు దు
ర్దముఁడై యీ లవణాసురుండు వనులన్ దర్పించి వర్తించెడిన్.

రాము.—ఓహో! శంకరవరప్రసాద గర్వితుఁడా లవణుఁడు.

లక్ష్మ.—శునకపుచ్ఛముఁ బట్టుకొని మహాసముద్రము నీఁదఁగడఁగుటయా?

4 ముని.—(స్వగతము) లవణుఁడు శంకర వరప్రసాద దుర్వారుఁడని వెనుదీయునా రామచంద్రుఁడు.

శత్రు.—ఆ దుష్టరాక్షసుఁడు అర్ధనారీశ్వర వరప్రసాదమాత్రముననే యింత గర్వింపవలయునా?

శా. సీతాదేవి స్వయంవరోత్సవమునన్ శ్రీరామచంద్రుండు దా
చేతంబట్టిన శైవకార్ముకము విచ్ఛిన్నంబుగాఁ గూలదే!
భీతిం జెందకుమే త్రిశూలమనిన్ వేయేల భూతేశ్వరున్
మాతోఁ బోరుకుఁ దెచ్చినన్ వడతుమే మాంసాశన వ్రాతమున్.

1 ము.—రాజకుమారా, ఆత్మోచితశూరాలాపము లాడితివి.

2 ము.—మేము రక్షింపఁబడితిమి.

3 ము.—చిరంజీవీ వర్ధిల్లుము.

రాము.—మునులారా! భయపడవలదు.

4 ముని.—(మునులవంకఁ దిరిగి) తాపసులారా! మహారాజు అభయప్రదానముచేసెను. ఇఁక భయపడకుఁడు.

వశి.—ధర్మము గౌరవింపఁబడినది.

2 ముని.—మహాప్రభో! రామభద్రా! యాదుష్టరాక్షసుడుఁ బ్రతికియుండువఱకు మా నిత్యనైమిత్తికకృత్యములు కొనసాగవు.

1 ముని.—దీనశరణ్యా! మా యాపదలేమని విన్నవింతుము.

సీ. సవనయూప స్తంభ నివహంబు రోకళ్లకని పెల్లగింప మాటాడరాదు
యాగభాగంబుల నర్పింపుఁ డనకోరసికున్న యమపురి కేఁగవలయు
పీచుగడ్డంబులు పెఱికి త్రాళులుపేనవలెనన్న నెదిరింప వలనుపడదు
తపసి కన్నెలఁబట్టి దయామాలి చెఱఁబెట్టఁగనులుకాయలు గాయఁ
గాంచవలయు

తే-గీ. రాక్షసుల గుండగంబులు రాజసభలఁ
దెలుపునట్టివె యటఁజూడ నలయుఁగాని;
రామభద్రుండు త్రైలోక్య రాజ్యమేలఁ
దాపసులకిట్టి దుర్గతి దాపరించె.

వశి.— రామరామ! యెంతటి మాటవినవలసె.

రాము.—పాపము శాంతించుగాక!

2 ముని.—మహారాజా, ఆలవణాసురుని విజృంభణమటుండనిచ్చి మానవమాంసాభిలాషులగు అదానవ సైనికుల యాపలాపప్రలాపంబులు వినివిని మా చెవులు కాయలు గాచినవి.

మ. లవణుండే భువనత్రయీశ్వరుఁ, డఁ కేలాపల్కు, లింకొక్క మా
నవనాథుం బతియంచు వాకొనిన మీనాల్కల్ దెగంగోసి నె
త్తు వెదల్ చల్లెద మూరికాకులకు, నేరోమిమ్ము రక్షించు ధ
ర్మవిదుల్ దెండన నాశ్రయించితిమి రామా మానికల్పద్రుమా.

వశి.— దానవసంహారమునకై యవతరించిన ధర్మస్వరూపునకు విధిగదా తాపసరక్షణము.

లక్ష్మ.—మునీంద్రా, యూరపిచ్చుకపై బ్రహ్మాస్త్రము ప్రయోగింపవలయునా? ఆ యల్పరాక్షసుని వధియించుటకు దశకంఠసంహారకుఁ డేగవలయునా?

సుగంధి. ఒక్కరుండఁ జాలనే మహోగ్రవహ్ని కీలలం
గ్రక్కుబాణ సంచయంబు గాడ నేసివాని పే
రక్కఁ జీల్చి నెత్తుకండ లంతటన్ విదిర్పఁగన్
దక్కువారలేల యొక్క దానవున్ వధింపఁగన్.

ముని.— లక్ష్మణకుమారా, భళి! భళి! ఇంద్రజిత్సంహారకునకుఁ దగినవే యీవీరవాక్యములు.

శత్రు.— అన్నా నిజప్రతాపము నేల యుజ్జగించుకొందువు. కుక్కనుగొట్ట బచ్చెనకోల గావలయునా?

శా. కాయల్గడ్డలు మెక్కు బక్కరుసులం గారించు దైతేయులన్
మాయింపన్ యశమా నె, నీవలుగఁగా మాయావియౌ యింద్రజి
త్తో, యుద్ధంబునఁ గుంభకర్ణ ముఖదైత్యోత్తంసులో వారతే
లా యీపూనికి లక్ష్మణా యసురఁ గూల్పన్ నన్నుఁ బుత్తెంచుమా.

రాము.— వత్సా! శత్రుఘ్నా నీపలుకులు ముద్దులొలుకుచున్నవి. నీవె యాలవణాసురుని వధియింపఁ బోయెదవు.

శత్రు.— ప్రసాదము.

మునులు.— మహాప్రభో! మాగుండెలు కుదుటఁ బడినవి.

రాము.— తాపసులారా, యిఁక మీ మునిపల్లెకుఁ బొండు.

1ముని.— క. శ్రీరామచంద్ర నివే
యీరాజ్యము నేలవయ్య యీతి రహితమై
ధారాళ సౌఖ్యములు చే
కూరఁగ జనులెల్ల సతముఁ గుతుకము నొందన్.

(అవనిక జారును).

———

# తృతీయాంకము

## 1. రంగము. పాజారపుముంగిలి.

### భద్రుఁడు.

భద్రు.—గూఢచర్య మెంతనిష్ఠురమైన యుద్యోగము! అప్రియమైనను సత్యమే పలుకవలయు. భూపతులు చారనేత్రులుగదా! ఏమి సేయుదును. ఎంతకాలము తెలుపక యూరకుందును. విశ్వసనీయుఁడ ననిగదా మహారాజు న న్నీకార్యమున నియోగించె. ఎన్నిమాఱులో పలుకయత్నించియు నాలుక యాడమి నూరకుంటిని. నేఁ జెప్పక దాఁచినను మఱి యేచారుఁడైనఁ దెలుపవచ్చును. కుండమూయ మూఁకుడు గలదుగాని లోకమును మూయ మూఁకుడు గలదా?

కటకటా! యిట్టి యుద్యోగమునకా యింతకాలము జీవించియుంటిని. ఆత్మహత్యగావించుకొని యీ రహస్యము దాఁచియుంతునా? (ఆలోచించి) ఎంత వెఱ్ఱివాఁడను. నే హత్యగావించుకొనిన మహారాజు విశ్వసనీయుఁడగు వృద్ధచారుని గోల్పోవుటగాక మఱి యేమి లభించును. కోమలస్వభావయగు జనకరాజకుమారి యీ యపవాదమువిన్న బ్రతికి యుండగలదా.

అహో! లోకమెంత యవివేకపూరితము!

తే-గీ. అగ్నికీలలఁ బరిశుద్ధ మైనతల్లి
పంక్తిరథునకుఁ గోడలు పరమసాధ్వి
రాఘవునిపత్ని సద్గుణ రత్నఖనిని
దూఱిరి లోకులు కళంక దూషితనుగ.

(మందారిక ప్రవేశించును.)

మందా.—(స్వగతము) అంతఃపురమున నమ్మకమైన గాసిగానుండుటకన్న బావిలో పడి చచ్చుటమేలు. ఏ పనికైనను మందారికయేపోయి చావవలయును. ఆ పురోహితుఁడు ఎక్కడ బ్రాహ్మణార్థము చేయుచున్నాడో యెట్లు కనుగొందును. వాఁడుగో భద్రుఁడు దివాణముదిక్కునకే వచ్చుచున్నాఁడు, అతని నడిగినఁ దెలియును ఈ ముసలిభద్రుఁడు అంతఃపురమున తా నొక్కఁడే

విశ్వాసపాత్రుఁడని గర్వపడుచుండును. అతని కొంత శివమెక్కించిపోయెదను. (మందారిక తొంగి తొంగి పోవుచుండును.)

భద్రుఁడు.—ఎవ రక్కడ ?

మందా.—(పలుకదు).

భద్రు.—ఎవ రది ? మందారికా! ఏమిపలుకవు.

మందా.—ఏమి యాపదగలిగినది. ప్రాణముపోయేట ట్లరుస్తున్నావు.

భద్రు.—ఓసి తొత్తుకుంతురా, ఏమి తొంగితొంగి పోవుచున్నావు.

మందా.—నీవంటి నవకోటి మన్మథాకారుని రాచుకొని పోవలయునా ?

(పోవుచుండును.)

భద్రు.—మాటలలోనే దాఁటిపోవుచున్నావె. ఇటురమ్ము. నీయొడిలో నేమొ దాఁచుకొనిపోవుచున్నావు. ఏమైన దొంగిలించవు గదా.

మందా.—నీపనికి నీవు పొమ్ము. తక్కినపనితో నీకేమిసంబంధము. దివాణమంతయు నీమొగముపై నడచుచున్నదా ?

భద్రు.—ఒసే శానిసకూతురా, మహారాజంతవాఁడు నన్ను పల్లెత్తు మాటయనఁడు. నీవా నన్ను తిరస్కరించుదానవు. రామభద్రుని శైశవమునుండి నేను సేవకుఁడను సుమా.

మందా.—అబ్బా ! అయోధ్యారాజ్యమును రక్షించితివి. ఇఁక నీవుచచ్చిన రాజకుటుంబము పుట్టిమునుగును. (పోవ ప్రయత్నించును.)

భద్రు.—ఓసీ, మాయలాఁడీ. ఎక్కడికి కదలుచున్నావు. (చేయిపట్టుకొని యొడి తడవును)

మందా.—(చిఱునవ్వుతో) భద్రా మన కిరువురికి పాణిగ్రహణమా!

భద్రు.—ఛీ ! ఛీ ! గయ్యాళి. (చేయి వదలును)

మందా.—నీరసికత్వము తెలిసిందిగాని, పురోహితుని యెక్కడనైన చూచినావా ?

భద్రు.—ఎందుకు ?

మందా.—నిన్నటిరాత్రి నాలుగోజామున దేవిగారు దుస్స్వప్నము గన్నారట. అందుకై శాంతిపూజ చేయించవలసిందని ఆజ్ఞ అయింది.

భద్రు.—(ఆశ్చర్యముతో) దుస్స్వప్నమా, [illegible]రా ! దుర్భిక్షమునకు ముందు ధూమకేతువు.

మందా.—(స్వగతము) ఈ ముసలిభద్రునకు ప్రతిదియు అమితముఖ్యముగ దోఁచుచుండును.

భద్రు.—మందారికా, పురోహితుఁ డెక్కడనున్నాడో నాకుఁ దెలియదు.

మందా.—ఈవానకొ అన్ని ధమధమలు. (నిష్క్రమించును.)

భద్రు.—ఇఁక నాలసింపఁదగదు సేవకు లస్వతంత్రులుగదా.

## 2. రంగము విశ్రాంతిభవనము.

(రాముఁడు).

రాము.—ఓరి, యెవఁడురా అక్కడ?

ద్వారపాలకుఁడు.—మహాప్రభో; దాసుఁడను.

రాము.—ఓరీ, రాజ్యకార్యవిముక్తులమైన మా కించుకసేపు లోకవ్యవహారవినోదము గావింపవలయునని భద్రునకు మామాటగఁ దెలియఁజేయుము.

ద్వార.—ఏలినవారియాజ్ఞ.— (నిష్క్రమించును.)

భద్రు.—రామభద్రా జయము జయము!

రాము.—భద్రా, విశేషము లేవియైనఁ గలవా?

భద్రు.—(నవ్వుచు) ఒక గొప్ప విశేషముగలదు. పాపదేవత మాత్రము మిమ్మెప్పుడు వేయినోళ్ల దూషించుచుండును.

ఆ-వె. సకలభోగభాగ్య సౌఖ్యములకుఁ బుణ్య
కార్యములకు నునికి గలుగు రామ
రాజ్యమందు, నాకు రవయేనిఁ దలదాఁప
నీడలేదటంచు నిత్యమగలు.

రాము.—(చిఱునవ్వుతో) ఓయీ, నీ ప్రియోక్తులు చాలింపుము. లోకు లేమనుకొనుచున్నారు?

భద్రు.—దేవర పవిత్రచారిత్రము లోకమున కాదర్శప్రాయమైనది.

ఉ. రాముఁడు లోకరక్షకుఁ డరాతిభయంకరుఁ డా[illegible]దో
ష్ణ్యమహారుండు, దుష్టజన శిక్షకుఁ డార్యజనావనుండు స
త్యామలనీతికోవిదుఁ డహంకృతిదూరుడటంచు సజ్జన
స్తోత్రములాడుకోఁగఁ బరితోషముతో వినుచుందు నెప్పుడున్.

రాము.—భద్రా, యివి కేవలము స్తుతివాక్యములు. లోపములేవి వాకొనరా లోకులు.

భద్రు.—(స్వగతము) హా! మందభాగ్యుఁడను ఏమి తెల్పుదును.

రాము.—ఓయీ, యేల పలుకక యూరకున్నావు?

భద్రు.—(స్వగతము) ఇఁకఁ జెప్పకతప్పదు. (చెప్పఁబోయి యూరకుండును.)

రాము.—భద్రా, యేల సంశయించెదవు! (స్వగతము) ఈతనికేలనో దుఃఖావేశము గల్గినది. పలుకఁజాలక స్తంభితుఁడై యున్నాఁడు.

క. తనువుద్గత ఘర్మంబుగఁ
గనుఁగొనలను బాష్పవారి కణములు జాలన్
ముని పెదవులు చలియింపఁగ
మనమునఁ గలవంతఁ దెలుపు మాదిరి దోఁచున్ ;

(ప్రకాశముగ) ఓయీ, లోకుల కేమియవాంతరము వాటిల్లదు గదా?

భద్రు.—(నిట్టూర్పుతో) అట్టిలోకుల కేల యవాంతరము గలుగును.

రాము.—(ఆతురతతో) ఎట్టి లోకులకు?

భద్రు.—ఆ. వె. బుద్ధిహీనులైన పురజనులాడెడు 1
పలుకు లెప్పుడు నమ్మ వలనుపడదు 2

రాము.—(ఆతురతతో) పౌరు లేమనుకొనుచున్నారు?

భద్రు.— అగ్నిశుద్ధయైన యతులచిత్రకుఁ దప్పు 3
లంటగట్ట జంక రళుకువడరు. 4

రాము.—(ఉద్వేగముతో) హా! యేమి వినుచుంటిని. భద్రా యేమంటివి. జానకిని నిందించిరా లోకులు?

భద్రు.—జానపదులు నీరుదెచ్చుకొను బావికడ నొకపల్లెత యేమేమొ యపవాదములు పలుకుచుండెను. నే నెట్లు చెప్పఁగలను.

రాము.—భద్రా, యళుకుపడవలదు.

భద్రు.—రావణుఁ డెత్తుకొనిపోయి తనయింట నుంచుకొనిన సీతను మరల రాముఁడు పరిగ్రహించెను; కౌసల్యాదేవి యింటఁ బెట్టికొనుటకు సందేహింపలేదు. కౌసల్యయే నేనైన కోడలి నిప్పుడే యిల్లు వెడలించి యుందునని యేమేమొ యసంబద్ధము లాడుచుండెను.

రాము.—హారా! మందభాగ్యుఁడనగు నన్ను గుఱించి సాధ్వియగు తల్లియగు కౌసల్యాదేవినిఁ గూడ నిందాపాదనమా?

అకటా! వంచింపఁబడితిని. శైత్యమునకై శ్రీఖండతరువు నాశ్లేషించితిఁగాని కోటరనిలీనయగు విషభుజంగిని గాంచనైతి. ఛీ! దుష్టహృదయమా! వహ్నిపరిశుద్ధయైన సీతనుసైతము సంశయించుచున్నావా?

భద్రు.—రామభద్రా, యవివేకులయాడికోలు పాటింపఁదగదు.

రాము.—ఓయీ సత్యము పల్కితివి.

ఉ. ఏ లలితాంగి సచ్చరిత మెల్లజగంబులఁ బాపవల్లికా
మూలఖనిత్రమై భువనపూజ్యమునై నుతికెక్కె నట్టి నా
పాలిటిభాగ్యలక్ష్మి యపవాదభరంబునఁ గ్రుంగునట్లు కాం
తాళముతోడ లోకులనఁ దాలిమిఁ గొందునె చిత్త మిత్తఱిన్?

ఓ నిర్విచారప్రపంచమా, నీకుఁ గాలావధి యున్నెఁ గాఁబోలు.

తే-గీ. అనల పరిశుద్ధయైన పూతాత్మ సీతఁ
దూలనాడిరిలోకులు దురితమతులు
అగ్నిశిఖతోడ సయ్యాట లాడఁబోవు
శలభము లెటులుంగునే ప్రాణ సంకటంబు.

భద్రు.—(స్వగతము) ఆశ్చర్య! యేమియుత్పాతము లుప్పతిల్లనున్నవో— (ప్రకాశముగ) మహాప్రభో శాంతిల్లుము. దేవరయేకోపించిన నిఁకఁ బ్రపంచమున కెవ్వనిపాదతలము శరణ్యము! ఆకాశమే కూలిపడిన నెత్తిపట్టువార లెవ్వరు?

రాము.—(స్వగతము) కోపావేశమున సర్వ మతిక్రమింపనుంటిని. (ప్రకాశముగ) భద్రా, సీత రావణాపహృతయైనదనుట సత్యము. లంకలో నివసించుటయు యథార్థమె. ఇఁక లోకులేమి యన్యాయమాడిరి?

భద్రు.—ఇంతవఱకు నిజమాడిరి.

రాము.—అవును. లోకము పాపాంకి.

భద్రు.—ఇక్ష్వాకువంశము అపవాదాతీతము గదా.

రాము.—(స్వగతము) హృదయమా, నీకార్య మెట్లు నిర్వర్తించెదవు? ప్రియాంగనాశ్లేష సౌఖ్యము నపేక్షించి చిరకాలాగతమగు రఘువంశకీర్తి కళంకితము సేయుదువా? సద్యశమును రక్షించుటకయి యర్ధాంగినైనఁ బరిత్యజించెదవా? కఠినచిత్తమా యేమి యుపదేశించుచున్నావు.

తే-గీ. పెండ్లి వేళఁ గాలిబొటనవ్రేలి నొక్కి
కంకణమనోజ్ఞమగు సీత కరముఁగొన్న
ప్రియము విడనాడి నేఁడు గర్భిణిని సాధ్విఁ
గీర్తికొఱకు వనంబున గెంట మనెదె.

(ప్రకాశముగ) భద్రా, నీవుపోయి లక్ష్మణుని నిటకు రమ్మనుము.

భద్రు.—ఏలినవారిచిత్తము. (నిష్క్రమించును.)

రాము.— ఈ యపవాదమును లక్ష్మణునకెట్లెఱింగింతును.

(లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ.—(స్వగతము) అన్నగారేమొ దీనవదనులై విచారించుచున్నారు. (ప్రకాశముగ) అన్నా, లక్ష్మణుఁడు మ్రొక్కుచున్నాఁడు.

రాము.—వత్సా, లక్ష్మణా, రాముని జీవితము శూన్యమైనది. ఇఁక నీ వసుంధరాభారమును నీవ వహియింపుము. అందుకై నాకొక ప్రత్యుపకారము సేయుము.

లక్ష్మ.—(ఆశ్చర్యముతో) ఏమి యీ వింత.

రాము.—లక్ష్మణా,

క. ఈ కరవాలము గైకొని, నాకంఠముఁ ద్రుంచుమీ—

లక్ష్మ.—అమంగళము శాంతించుఁగాక!

రాము.— క్షీణంబును రాముం
డీకష్ట లోకజీవన, శోకము సహియింపలేఁడు క్షుభితాత్ముండై.

లక్ష్మ.—అన్నా! యాకాండమునఁ నీ మనమేల యింత భ్రాంతిల్లినది. ఏమి యాపద సంభవింపదు కదా! నీ కఠోరవాక్యములు నా హృదయపుటము భేదించుచున్నవి. కాంతావియోగమునంజైన నింతటి నిర్వేదముఁ బొందియుండఁగవు.

రాము.—లక్ష్మణా, సీతావిరహము రామునదిమాత్రమె. కీర్తివియోగము ఇక్ష్వాకువంశమంతటిది.

మ. చిరకాలార్జితమైన గౌరవయశశ్శ్రీ నేఁడు లోకాపవా
దరజఃపంకకళంకితంబయి చెడెం దమ్ముండ యింకేల యీ
ధరణీరాజ్యము; పూజ్యవంశగరిమన్ దైన్యాంబుధిన్ ముంచితిన్
నరనాథుల్ ననుగాంచి నవ్వరె? యిసీ! నాకేల యీ ప్రాణముల్.

లక్ష్మ.—అన్నా! నీపలుకులు ఎంతఁగొలుపుచున్నవి. ఇక్ష్వాకువంశమా అపవాద పంకిల మగుట! ఆశ్చర్యము!

క. నిప్పునకుఁ జెదలుపట్టునె
కప్పూర సిరమొులయునే వికారపుఁ దావిం
దప్పులు గలుగునె రఘుకుల
మొప్పను దేజంబు దొఱఁగ నో రఘువీరా.

నీ మనం బిటులశోకసంతప్తమగునటుల నపరాధమెవరించిన వా రన్నయ్య?

రాము.—రావణాపహృతయయి పునర్గృహీతయగు సీత.

లక్ష్మ.—(నిర్విణ్ణుడయి) కటకటా! యేల యిట్టిసంశయోక్తు లాడెదరు?

రాము.—సంశయోక్తులు లోకులవి.

లక్ష్మ.—(కోపముతో) ఏమీ—లోకులు దూషించిరా పతివ్రతా శిరోమణిని?

చ. తెలియరొ ధారుణీ తనయ తెంపరిమూకల యాడికోలుకుఁ
వెలుపటి సత్యతేజమని, వీరలవారల పోల్కిఁగండ క్రొ
వ్వోలయఁ బవిత్రవర్తనను నొప్పసికారులు ప్రేలినట్టి లో
కులను నుపేక్షసేత మనకు న్నరపాలురకైన ధర్మమే?

అన్నా, లోకులు మందబుద్ధులు; గతానుగతికులు; సత్యాసత్య వివేక శూన్యులు.

రాము.—అవును; అగుదురు.

లక్ష్మ.—అట్లయిన వారి యపలాపప్రలాపములా మనకుఁ బ్రమాణములు.

చ. జనులపవాదముల్ పలుకఁ జాలుదురంచుఁ దలంచి లంకలో
ననలవిశుద్ధయౌటకు నిలాత్మజ నీవడుగంగ నెమ్మనం
బున నళుకింతలేక నగుమోమునఁ జొచ్చె హుతాశ నార్చులన్
జనకజ నిష్కళంకయని సన్నుతిగొంప నిలింపసంతతుల్.

రాము.—వత్సా! నాకన్నులను నేనే విశ్వసింపక పోవుదునా?

ఉ. నమ్మెడివాఁడఁగాను లలనామణి జానకి సంశయింప న్యా
యమ్మని, యైన లోకులు నయమ్మెడఁ బాసి వివేకశూన్యులై
యిమ్మహితాపవాద ముదయింపఁగఁ జేసిరి; దూఱువాప నిం
ద్యమ్ము యధర్మమో విధియొ తమ్ముఁడ నీవెతలంపు మీయెడన్.

లక్ష్మ.—ఇఁక మూఢాత్ములే ధర్మసాక్షులా?

రామ.—లక్ష్మణా.

ఆ-వె. మూఢచిత్తులైన బుద్ధిమంతులె యైనఁ
ప్రజలరంజనంబు పాలనంబు
సత్యబాహ్యమైన సమ్మతిగాకున్న
వారినను సరింప వలయు నృపతి.

లోకులభినందింపని రాజ్యపాలనము నిరర్థకము.

క. నన్నైన సీతనైనను, నిన్నైనను రాజ్యమైన నేవిడతును లో
కోన్నతకులకీర్తికి నాపన్నత వాటిల్లెనేనిఁ బలుకులిఁకేలా ?

వత్సా! యేలవితర్కము? కార్యము నిశ్చయింపఁబడినది.

లక్ష్మ.—(ఆతురతో) ఎటులు?

రామ.—ఇటురమ్ము. (మెల్లగా) సీతను ఋష్యాశ్రమమున వదలిరావలయు.

లక్ష్మ.—(చకితుఁడై) అకటా! యేమివింటిని; కానలకుఁ బంపుటయా? అన్నా చిత్తచాంచల్యమునఁ బలుకవుగదా?

రామ.—తే-గీ. నిండుచూలాలి జానకి నెనరులేక
కాననంబుల కంపింపఁ గడగువీని
కెక్కడిది చిత్తచాంచల్య మేటికరుణ?
యేన క్రూరుండఁ బల్కితి నిట్టిమాట.

లక్ష్మ.—అన్నా! అతికఠోరశాసనము.

రామ.—లోకమును సంతోషపెట్టవలయు.

లక్ష్మ.—లోకమున సజ్జనులులేరా?

రామ.—తమ్ముఁడా! సజ్జనుల కత్తిపోటులకన్నను దుర్జనుల నాలుకపోటు లతి క్రూరములు.

లక్ష్మ.—అన్నా! అపూర్వమీ ఘోరశిక్ష.

రామ.—ఇక్ష్వాకువంశకీర్తి నిరంతరవిశ్రాంతము. ఈయపవాదము తూలరాశింబడిన యగ్నికణమువలె సకలదిక్కులకు వ్యాపించును.

లక్ష్మ.—నీకు ధర్మము నుపదేశించునంతటి కోవిదుఁడనా.

రామ.—ఉపదేశించియు నిరుపయోగము.

లక్ష్మ.—(స్వగతము) అయ్యో! యిఁక నే నేమి సేయుదును. (ప్రకాశముగ) అన్నా! దేవి యాపన్నసత్వ.

రాము.—ఈ క్రూరాత్మునిచిత్తము పాషాణసదృశము.

లక్ష్మ.—వెనుక చింతించియు—(అర్ధోక్తియందె).

రాము.—లక్ష్మణా! కర్మఫలానుభవ మెవ్వరికిం దప్పదు. కార్యము నిశ్చితము. ఆజ్ఞను పాలింపుము.

లక్ష్మ.—(స్వగతము) వినయమునుచే నిరుత్తరుఁడ నైతి (ప్రకాశము) మీ యిష్టానుసారము ప్రవర్తించెదను.

రాము.—దండకారణ్యనివాసినులగు తాపసబాలికల దర్శింప సీత యభిలషించినది. నేఁడే ప్రయాణము సాగింపవలయు.

లక్ష్మ.—(దుఃఖముతో) అన్నా! పటియొక్క మాట.—

రాము.—లక్ష్మణా! యిఁక మాటాడిన నా యానగలదు. అగ్రజుని పనుపు సేయుము. పొమ్ము.

లక్ష్మ.—(స్వగతము) ఎటేఁగి యెటేఁగి నేనీ ఘోరకృత్య మెట్లాచరింతును. హా! పాపపుదైవమా నీకెంత యెనములేక పోయె. (నిష్క్రమించును.)

రాము.—(దుఃఖముతో) ఔరా! యెంతటి కాఠిన్యమాశ్రయించుకొన్నను శోకభారమున నాచిత్తము క్రుంగుచునే యున్నది. పత్నీవిరక్తుఁడ నగుటయేగాక యనుజతిరస్కారియుం గావలసె.

జానకి లేక రామునికి మనికిగలదా? కఠినహృదయమా! నీకార్యము నిర్వర్తించితివి. ఇఁక రాముని సంసారము సారమైనది.

హా! వనవాసప్రియసఖీ! జానకీ! నిన్నుఁ గానలకంపి నే నెట్లు బ్రతికి యుందును. పదునాలుగేండ్లు ఘోరకాంతారముల నివసించియు నీవు నన్నుఁ గూడియుండుట గదా యాపదలెల్ల సౌఖ్యములుగను, అరణ్యమే యయోధ్యగను జూపట్టినది. నీవు దైత్యాపహృతవైనప్పుడు గదా నాకు యథార్థమైన యరణ్యనివాసము.

ప్రాణప్రియా! యీ క్రూరాత్ముని యుపభోగ్య హారవల్లికయని గ్రహించితివి; విషవ్యాళమై కఱచినవాఁడు.

తే-గీ. దేహమునుండి హృదయమ్ముఁ దీసినైన
హృదయ దేహమ్ము లెడమాట బ్రదుకఁ గలవె?
నాదు నర్ధాంగి సీత ననాదరమునఁ
గానకంప మాయిద్దఱి గతు లిఁ కేమొ.

జానకియందు లోకమే గాదు అపరాధి; ఈ కారుణ్య రహితుఁడు రాముఁడు కూడ !

తే.గీ. ప్రియుఁ డటంచును సౌందర్య మయుఁడటంచు
ధీరుఁడనుచును త్రైలోక్య వీరుఁడనుచు
నెవనినమ్మి కరాంబుజ మిచ్చినావొ
ఆకులాంతకుఁడే కానకంపునిన్ను.

సీతా ! మమైకజీవితా ! నేను జీవించియు ననాథవైతివా (దుఃఖించును) (అవనికి జాఱును).

III. రంగము సీతపడకటిల్లు.

(సీత నిద్రించుచుండును. రాముఁడు ప్రవేశించును.)

రాము.— అకటా ! కఠోరచిత్తమా. నీవేల మెత్తనివనమూనితివి' నన్నేల యర్ధరాత్రమున నీయంతఃపురమునకుఁ గొనితెచ్చితివి? నీయందనురాగ మిసుమంతయైనఁ గలదా ? అట్లయిన లక్ష్మణుని ప్రసన్న మనోగములగు అనునయాలాపములు నీవజ్రసదృశమగు కవచము నేల భేదింపలేక పోవును.

మ. జననంబాది నిశాతశస్త్ర విదళచ్ఛత్రోత్త మాంగస్రవ
ద్ఘన రక్త హ్రదమందుఁ జేతులను సంక్షాలించు శ్రీరామభ
ద్రుని చిత్తంబవు ! నీకు నెక్కడిది కారుణ్యంబు ? గాకున్నఁ గా
నన కంపింపగ నియ్యకొందువె సతీ నారీశిరో రత్నమున్.

ఇదే జానకీ శయనాగారము. ఈ మందిర మనుదినపరిచితమయ్యు మనోశాల్యము వలన నూతన నివేశమువలె నగపడుచున్నది.

అంతఃపురమంతయుఁ బ్రశాంతమై నిద్రానిబద్ధమై నిశ్చలమై యలరారుచున్నది. అచ్చటచ్చట మధుపానమత్తలై నిదురించు పరిచారికల యుచ్ఛ్వాసనిశ్వాసముల యలుకుడుదప్ప నొక్కచిన్నయైనను నిశాప్రశాంతమునకు భంగము గావింపదు. లోకమంతయును నిద్రానందపరవశమై యున్నను రాముఁడు మాత్రము శోకాకులుఁడై దొంగవలె ప్రసుప్తయగు సీతాలతాంగి శయనాగారము సొచ్చుచున్నాఁడు.

(పరిచారిక కలవరించును)

ఏమది.— పరిచారిక లెవ్వరైన మేల్కొనిరా ? కాదు. ఎవరోగాని కలవరించినది. నా జీవితేశ్వరి యెక్కడ నిద్రించుచున్నది. ఆ— అదిగో హంసతూలికా తల్పమున.—

ఉ. కన్నుల సత్తపఃఫలము కాయము నొందెను! యంబుదంబులం
జెన్నలికించు మించిటకుఁ జేరెను! కల్పలతాకుసుమంగ మం
దు న్నెలపూలపాన్పుపయిఁ దూఁగునిలింప లతాంగి యేమొ!
కాదిన్ననబోణి నాదుహృదయేశ్వరి జానకియే నిజంబుగన్.

ఆహా? ఏమి యీయమ్మాయిక వదనబింబమునఁ దాండవించు లావణ్యము!

మ. అలకాక్రాంత లలాటసీమను గవాక్షాయాత చంద్రాంశు మా
లలు కర్పూరపు నిగ్గులంజిలుకఁ దల్పంబందు నిద్రించు నీ
లలనారత్నము సీతయై యొదవ శిలా లావణ్య సారంబు ప్రో
జ్జ్వల కాంతాకృతి నొందెనో యనఁగ నాభావంబు రంజించెడిన్.

కరచరణాద్యవయవ శోభితమగు నాహృదయమే యిది. (ముద్దిడఁబోయి వారించుకొని) ఛీ! నే నెవ్వఁడ నీ నారీమణి నంటుటకు?

తే-గీ. రాముఁడనుగానొ? నిద్రించు రామ సీత — 1
గాదొ? నేనేల ముద్దిడరాదొ? — 2

నన్ను నేనే శూన్యుఁడనుగఁ దలంచుకొనుచున్నాను. ఏమి యిది స్వప్నమా?
కంటి — 2

సకట! దారుణసత్యంబు; నవనిజాత — 3
రామ హృదయంబుగాదింక, రమణి యెవతొ! — 4

మమైకజీవితా, సీతా, గృహేందిరా, హృదయేశ్వరీ, అని మధురముగ సంబోధించు నా నాలుక నేఁటి కిట్టి కఠినాలాపము లాడవలసెఁ గదా!

సీ. ఏకన్య పాణినందీయ శతానందుఁ
డంగంబు పులకింప నందికొంటి
ఏవనబోణి నేనేఁగుదెంచగఁ దాన
ఘోరాటవులకుఁ న న్గాచివచ్చె
ఏసాధ్వి దనుజాపహృతయయ్యు నేకవే
ణీవ్రతంబున సతీనియతిఁ గడపె
ఏమోహనాంగిని నెడఁబాయ నాకు లో
కము శూన్యమగు నట్టి విమలహృదయ

తే.గీ. అంబుజేక్షుగా రాకా శశాంకవదన
యజనభూజాత పూతవిఖ్యాత సీత
పాపకర్ముని కీర్తినాఁ బాసిపోవు
రామభద్రున కింక దుర్భరము బ్రతుకు.

జానకీ నాహృదయమును దొంగిలించుకొని పోవుదువా? ఈ రామునకు హృదయ మొకటి కలదా? కలిగిన ఈ బంగారుబొమ్మను, ఈ ముద్దులమూటను వన్య మృగములకు బలియీయ నెంచునా? కాంతామణీ ఈలోకమున నిన్నుఁ గాంచుట కిదియే కడసారియా? ఆశాకుసుమంబునకీ సంకర్షణమే వృంతచ్యుతియా!

లలనామణీ, నిరపరాధిని వగు నిన్నుఁ గాన పాలుసేయుచున్న ఈ కఠినాత్ముని మీయిలువేల్పులైనఁ గోపింపరేల? పితృలోకవాసులగు నో రఘుకులేశ్వరులారా! నన్నేల మీరు శపింపరు? నిలింపులారా, మీ సమక్షమునఁ గదా సీత యగ్ని పరిశుద్ధ యైనది, అట్టి మిమ్ములనైన గౌరవింపక కులకాంతను అడవులకు వెడలించు ఈ నిర్దయుని నేల సహించుచున్నారు. ప్రకృతీ ఏవేల తామసించితివి.

సీ. నిర్భరప్రళయాబ్ద గర్భసంభూతమై
కులిశోత్కరంబు నన్నూల్పదేమొ!
ఝంఝూనిలోద్వేల సాగర కల్లోల
ములు పొంగిపొరలి నన్ముంప వేమొ!
పెటపెటార్భటితోడఁ బెటిలి యీకుతలంబు
అతలంబునకు నన్ను నడపదేమొ!
క్షణకాలభగ్నమై స్తంభావలంబంబు
సౌధంబు గూలి నం జంపదమొ!
తే.గీ. రాముఁడే లేకయున్న సీ రాజవదన
యఖిల సౌఖ్యాభిరామయై యలరకున్నె
శోకఘూర్ణితమయ్యెను సౌఖ్యగాని
యెంత కఠినంబొ పగులదీ హృదయమకట!

సీత.—(నిదురలో) ఆర్యపుత్రా నన్ను మఱచితివా.

రాము.—సీత మేల్కనెనదా? (చూచి) కాదు కాదు. కలవరించుచున్నది. ఆహా! ప్రణయోత్కర్షము. ఈలతాంగి నిద్రయందైనను నన్నే దలపోయుచున్నది.

హృదయేశ్వరీ, క్రూరసర్పము అమృతమయఫలంబు నంటునీతి ఈనిర్దయుఁడు కడసారి ముద్దుగొనుచున్నాఁడు.

సీత.—(మేల్కాంచఁబోవును.)

రాము.—జానకి మేల్కాంచుచున్నది. ఇఁక నిటనుండఁదగదు. వీడిపోవఁ గాళ్లురాకయున్నవి. ప్రేయసీ! యిదే కడసారి సందర్శనము. (నిష్క్రమించును.)

సీత.—(మేల్కాంచి) ఆర్యపుత్రుని కంఠస్వనమువలె నెద్దియో అవ్యక్తగంభీరధ్వని నాకు వినఁబడినట్లు తోఁచినది. (కలయఁజూచి) ఇచ్చట ఎవ్వరును లేరు. కలగని మేల్కాంటినిగాఁబోలు. కనురెప్పలు నిద్రమాంద్యమునఁ గూరికొని పోవుచున్నవి. (నిద్రించును.) (అవనిక జాఱును.)

---

# చతుర్థాంకము

---

## విష్కంభము.

(మధురికా మందారికలు.)

మధురిక.—ఇదిగో అంతఃపురపరిచారిక వస్తూవున్నది. దీని నడిగిన సమాచారమంతా తెలియును. ఓసే మందారికా, తలవంచుకొని యెక్కడికే బిరబిర పోతున్నావు.

మందా.—ఓహో! మధురికా.

మధు.—నీవు రాణిగారితో గూడా మునికన్నెల చూడడానికి పోలేదా?

మందా.—ఆ— నాపని పోయినట్లే యున్నది.

మధు.—ఏమే గొంతుకు వురివేసుకోబొయ్యేదానివలె మాట్లాడుతున్నావు. అంతఃపురంలో నీకేమైనా చీవాట్లు తగిలినవా?

మందా.—కాదే పిచ్చిదానా! మహారాజుగారివొళ్లు జబ్బుసంగతి నీకు తెలియలేదా?

మధు.—ఏమో చూచాయగా విన్నాను. ఇప్పుడేమైన నెమ్మదిగా వున్నదా?

మందా.—మధురికా, యేలినవారికి జ్వరప్రారంభము గలిగిందని రాజవైద్యులు చెప్పు
కొనుచుండగా నేను రహస్యముగ వింటిని. దేవిగారినిగురించి యేమేమొ
కలవరిస్తున్నారుట మహారాజు! రాజసౌధములన్నీ హల్లకల్లోలముగా వున్నది.

మధు.—అయ్యో పాపము! యీసంగతి రాణిగారికి తెలిస్తేవుంటే మునికన్నెల
చూడడానికి పొయ్యేవుండదు.

మందా.—దేవిగారు బయలుదేరినవెనుకనే ప్రభువుగారికి జబ్బుపట్టినదట.

మధు.—అయ్యో! నీవొకసారైనా దరిశింపలేదా యేలినవారిని.

మందా.—వైద్యుల వుత్తరువులేనిదే రాజబంధువులు గూడ అక్కడికి పోగూడ
దని భద్రుడు చెప్పినాడు.

(నేపథ్యమున)

ఒసే మందారికా, నీవింకా యిక్కడనే నెత్తినము చేయుచున్నావా?

మందా.—వాడుగో భద్రుడు, పిలుస్తున్నాడు. తొందరగా పోవలెను. ఆ మునిలి
కట్టెతో నా కత్తెకోటరికి మైనది. (పోబోవును)

మధు.—మందారికా, యిప్పుడెక్కడికి పోతున్నావు?

మందా.—నవగ్రహదానాలియ్యడానికి కొట్టడనుండి నవధాన్యాలు తెమ్మని పురో
హితుడు పంపించితే పోతున్నాను.

మధు.—సరే పొమ్ము సాయంత్రం అక్కడికి వస్తాను.

(యిరువురు నిష్క్రమింతురు)

## 1. రంగము అడవి.

{ సీత చెట్టుమొదట నిద్రించుచుండును—
లక్ష్మణుడు ప్రక్కన నిలుచుండి యుండును. }

లక్ష్మ.—అదుగో శుక్రభగవానుడు నుదయించుచున్నాడు. సూర్యోదయ మగుట
కింకను గొంత తడవున్నది. (అలకించి) ఆహా! శకుంతసంతానముల కలకల
నినాదములు సమీరసమ్మిళితములై వీనులకు విందొనరించుచున్నవి.

మ. అనిలోచ్చాలిత పర్ణమర్మర రవవ్యాప్తిన్ సుఖస్వప్న బం
ధనము ల్వాయగ నుల్కిలేచి ఖగసంతానంబు నీడంబులన్
ఘనరావంబొనరింప యామవతి యాజ్ఞం గాలముం దెల్పెఁ గో
యనిచాటించెడు కాలమాపకుని కంఠ రావమో నాఁదగున్,

(సీతంగని) ఔరా! మానవుల కెంతటికష్టము లైనను అనుభవించుకొలంది సాధారణమగుచుండును. లేకయున్న నంతఃపురనివాసయోగ్యయగు ఈ సుకుమారి యెక్కడ—ఘోరమృగభయంకరమయి కఠినశిలాకంటక భూయిష్ఠమగు ఈ కాంతారతలమున నిదురించుట యెక్కడ—

మ. కదలీపల్లవ కోమలంబులగు నీలావణ్యవత్యంగముల్
దర్లలం గానలనిం గఠోరధరణిం దల్పంబునన్ రామ భా
మలుప్రదిండై సునిద్ర నొందెడఁగ, యోషిల్లలామంబు దా
రుప్రఖండంబు పధానముం జరిపి యూర్కుం బూర్ణ మండ్లంబులెన్.

మానవజీవితము సుఖదుఃఖ పరిపూరితమయ్యెను గర్మఫలానుభవమందు వ్యత్యాసము గనుపట్టుచుండును. అకటా! మా కుటుంబమునంతయు నెడతెగని శోకదావానలంబున ముంచుటకే జన్మించెనా? ఒక్కరు నొకటనైనను మంచి బ్రాతివాయఁడా ఆవిధాత!

మ. వనవాసంబుగతించె దానిపిల మర్యాదాపారముల్ దాసె భా
మిని చేకూఱె ధరాధిరాజ్యవిభవా మేయానుభావంబునన్
మనమింపార సుఖంబులొందు చెటులో మాకాలముం బుచ్చెనో
నని యోజింపనిటాయెః; జిత్రము లహో! యాదైవ నిర్దేశముల్!

తల్లీ విదేహరాజనందినీ, ఘోరాటవీవాసలబ్ధాలలు లెక్కకొట్టుమున కిటుకొను చుండ నేమియుం దెలియక సుఖనిద్రాపరవశయై యున్న శరీర సుకుమారివలె శయనించి యున్నావా?

రామచంద్రా, యిట్టి ముగ్ధహృదయను నిట్టి లోకపావనచరిత్రను నీవిట్లు విడనాడసాహసించితివి. ఎంత వేడికొన్నను వినవైతివే. అకటా! యీపాపకౌర్య మొనరింప నగ్రజుఁడు నన్నే నియోగింపవలయు నా.

క. పదునాలుగేండ్లు వనముల
నొదవిన కష్టముల కోర్చి యున్నాఁడు డయా
ప్యదచిత్తుఁడు గాఁడని యా
సదయుఁడు నన్నీ యఘంబు సలుపఁజేసెనో!

కాకున్న నిట్టి నింద్యోద్యోగమున నన్నేల నియమించును. కటా! ఘాతప్రాయమగు రాజసందేశము నీ కుసుమకోమలకు నెట్లెటింగింతును? ఎట్లెఱింగింపక యూరక

కారణము! ఒకవంక నలంఘ్యమగు నగ్రజునియాజ్ఞ — వేఱొకవంక మృదులమగు మానుషస్వభావము నా యంతరాత్మను బీడించుచున్నవి.

సీత.—(మేల్కాంచి) మందాకినీ—(కలయంజూచి) ఓహో! అరణ్యపుర మును గాంచితిని. వత్సా, యరుణోదయమయినట్లున్నది.

మ. వనవృక్షచ్ఛదసంచయాంతరములన్ వ్యాపించి సూర్యాంశు కాం
చనకాంతుల్ పరికీర్ణ నిష్కముల యోజన్ నేల బింబింప భా
నునిభీతిం దిమిరంబు తారకల సందోహంబుతో వచ్చి కా
ననపాదంబుల నాశ్రయించెనన నానందంబు సంధించెడిన్.

లక్ష్మణా—

లక్ష్మ.—(ఆలోచించుచుం బలుకఁడు.)

సీత.—(స్వగతము) నిన్న సాయంకాలమున నేఁ బిలిచినను దెలిసికొనక లక్ష్మణుఁ డేదియో యాలోచించుచుండెను. ఇప్పుడు నతఁడు అన్యాయత్తచిత్తుఁడై చింతించుచున్నాఁడు. (ప్రకాశముగ) అన్నా, లక్ష్మణా.

లక్ష్మ.—అమ్మా, యేమంటివి?

సీత.—నిన్నటినుండియు నీవేలనో పర్యాలోచింతాసమగ్నుఁడవై యున్నాఁడవు. నీమోము మీఁద దైన్య మొలుకుచున్నది.

లక్ష్మ.—విశేష మేమియులేదు. ఈ వనమనోహారత్వమును దలపోయుచుంటిని.

సీత.—(స్వగతము) అదియేమొ నామనమున నూహింపరానిసంశయము వొడమచు న్నది. (ప్రకాశముగ) లక్ష్మణా నిన్నటిదినమున మనము గంగానదిని తరియించితిమి గదా, ఇఁక ఋష్యాశ్రమముల కెంతదూర మేగవలయును? వత్సా చూచితివా లేటికొదమను.

లక్ష్మ.—ఎక్కడ?

సీత.—(నిరూపించి)

తే-గీ. ఆశ్రమకురంగమల్ల దే యఱుతఁబూల
మాల వ్రేలాడ సెలయేళ్ల కూలములను
గప్పురము లట్లు నురుగులు గారుచుండ
మిసిమి పచ్చిక జొంపంబు మేయుఁగనుము.

చంద్రుల శోకమునకుఁ బారముండునా? నీకుఁ దల్లిదండ్రు లున్న వారికి నీవి పాలిశోద్యమమును దెలిపిరమ్ము. నా యీకడసారి సదుపదేశమును గమ నింపుము.

కుశు.—రాజా, క్షత్రియవీరులు ఉపదేశవాక్యముల ప్రయోగించియా విజయము నొందుట!

లక్ష్మ.—(స్వగతము) ఇసవిన నీబాలకుని చతురోక్తు లసహ్యము లగుచున్నవి. (ప్రకాశముగ) ఓయీ, నీవెన్వనిసవనాశ్వమును బంధించితివో యా లోకైక వీరుని క్రోధాగ్ని శిఖలయందేల శలభమువలె ప్రవగ్గదవు. ఆరామచంద్ర నరేంద్రుని యతిలోకశూరత్వము నీకుఁ దెలియక యింతటి సాహసకార్య మొనరించితివి కాఁబోలు.

సీ. కౌశికయజ్ఞంబుఁ గావంగ నేఁగుచోఁ
మార్కొన్న తాటక మదమడంచె;

కుశు.— ఆఁడుదానినిబట్టి యడచికూయఁగఁ జంప
నదియెశూరత్వ మంచనగవలెనె?

లక్ష్మ.— క్రతువాటి శోణితక్రవ్యముల్ చల్లు మా
రీచసుబాహుల పీచమడచె;

కుశు.— పండ్లు గడ్డలుమెక్కు బక్కతపసులనేచు
పిరికి దైత్యులఁగూల్ప పేరుఁజగునె?

లక్ష్మ.— ధరణీసుతాస్వయంవరమున గిరిజేసు
బలువిల్లుడాకేలఁ బట్టివిఱిచె;

కుశు.— చిరకాలముంటఁ బుచ్చినవిల్లు విఱిచిన
దానికే చంకలు దట్టవలెనె?

లక్ష్మ.— అతులవిక్రమశాలి నమరేశు సుతువాలి
నొక్కబాణంబున నుక్కడంచె;

కుశు.— ఇరువురు పోరాడునెడఁ బొంచి యొక్కని
మఱుగుగాఁ దెగటార్పమానుషంబె?

లక్ష్మ.—(స్వగతము) రామునిచరిత్ర మీబాలున కెట్లు దెలియును.

కుశు.—ఓయీ, రాజా, యేలయిట్లు వందివలెఁ బొగడుచున్నావు. రామునిశూర త్వము మాకు శ్రోత్రయా?

తే-గీ. కోతికొండముచ్చు లెలుగుగొడ్ల చేత
జలధి గట్టించినార లాశ్చర్యముగను!
వన్యమృగములఁ బాలించు వారుమీరు
మీదు శౌర్యోద్ధతుల కిలమేరగలదె?

లక్ష్మ.—ఓయీ!

కుశు.—రాజకుమారా స్తుతిపాఠమునఁ గొంతమఱచితివి. మీ రాముఁడు కాకిపైఁ గూడ నస్త్రప్రయోగము గావింపలేదా?

లక్ష్మ.—(కోపములో) ఓరి జ్ఞానలవదుర్విదగ్ధా! యెంత తాళుకొన్నను నీ యవినీతిని వీడకున్నావు. రామచంద్రనరేంద్రునిఁ దూలనాడిన నీగర్వమిపుడే యడంచెదను. రమ్ము—నీశరాసనముసజ్యము గావింపుము.

కుశు.—రాజా, యిప్పుడు క్షత్రియుఁడవైతివి. తపోవనశాంతికి భంగముగావింప వలదు. ఆ మరుప్రదేశమునకు నడువుము. (నిష్క్రమింతురు)

III రంగము.

(వాల్మీకికుటీరము, సీత.)

సీత.—సూర్యభగవానుఁడు నభోమధ్యగతుఁడై వేడిసెకల నుమియుచున్నాఁడు. నా ముద్దుకొమరు లేలొకో యింతవఱకుఁ గుటీరమునకు రారు. అయ్యో! యేమి నా కుడికన్నదరుచున్నది.

(మాండవ్యుఁడు ప్రవేశించును.)

మాండ.—అమ్మా, అమ్మా. అరణ్యకో—(దుఃఖించును)

సీత.—నాయనా. మాండవ్యా యెందుకు దుఃఖించుచున్నావు? కుశలవు లెక్కడ నున్నారు?

మాండ.—అమ్మ యేమిచెప్పుదును. ఇంకను కుశలవులా (దుఃఖించును.)

సీత.—(తత్తరముతో) ఏమీ కుశలవులేమైరి? వారిపు డెక్కడనున్నారు? వచ్చుచున్నారా? ఒక్కమాటచెప్పుము.

మాండ.—ఆర్యా! నానాలుక యాడకున్నది.

సీత.—నాముద్దుబిడ్డలకేమైన నాపద సంభవించెనా? మాండవ్యా, యేల విలంబించెదవు.

మాండ.—ఎక్కడివో పాపిసైన్యములు కళ్యాణసరస్సుప్రాంతముల విడిసినవి. వారి సవనాశ్వమును కుశుఁడు కట్టివైచెను. సేనాధిపతి వచ్చుననుభీతితో నేను దూరమున దాఁగియుంటిని. అంతలో సేనాని వచ్చెను.

సీత.—మాండవ్యా, తర్వాత!

మాండ.—తర్వాత కుశుఁడును సేనానాయకుఁడును ఏమేమొ వివాదములు సలుపుచుండిరి. ఆమాటలు నాకు స్పష్టముగ వినఁబడలేదు.

సీత.—మాండవ్యా, కుశలవుల కేమియాపద గలుగదుగదా? ఒక్కక్షణముసేపు విలంబన మొక్కయుగముగఁ దోచుచున్నది.

మాండ.—అమ్మా, వా రిరువురి వాదములనూహింప, సేనాధిపతి యశ్వమునువిడువుమనియుఁ గుశుఁడు విడువననియు అన్యోన్యము తర్కించుకొనుచుండినట్లు కనుపట్టినది.

సీత.—(నిట్టూర్పుతో) ఆర్యా! బాలుఁడెక్కడ, యజ్ఞాశ్వమును బట్టుటెక్కడ? ఇంత నేరమిదగునా? మాండవ్యా కుశుఁడు అశ్వమును విడువలేదా?

మాండ.—ప్రాణములైన వదలి పెట్టునేమొగాని వారువమునుమాత్రము విడువఁడు.

సీత.—ఆర్యా! నీవైన బుద్ధిసెప్పవా?

మాండ.—నే సమీపమున నుండినఁగదా —

సీత.—తరువాత.

మాండ.—సేనానియును గుశుఁడును మరుప్రదేశమున కరిగిరి

సీత.—వా రచ్చటఁ బోరుసల్పిరా?

మాండ.—వేఱు చెప్పవలయునా!

సీత.—అకటా! యెంతప్రమాద మెంతప్రమాదము!

తే-గీ. పోరులను నాటితేటిన పేరులేడ?
బాణవిన్యాస మెఱుఁగని బాలురేడ?
శౌర్యసాహస సాధ్యంబు సమరమేడ?
యిన్ని తలపోసి శంకించు హృదయ మకట!

మాండ.—అమ్మా శంకింపవలదు. కుశుని సంగరకళాకౌశలము వీక్షించి సేనాధిపతి విస్మితచిత్తుఁడై ప్రతీకారసంధానజడుఁడై యూరకుండెను.

సీత.—మాండవ్యా, లవకుమారుఁడు దగ్గరలేఁడా ?

మాండ.—అమ్మా, అతఁడు సమిధలను మోసికొని కుటీరమునకు వచ్చుచుండెను.

సీత.—అట్లయినఁ గుశుఁ డొంటరిగ యుద్ధము చేయుచున్నాఁడా ?

మాండ.—అయిననేమి ? అగ్నికణ మొక్కటి చాలదా కొండంత తూలరాశిని బుగ్గి సేయుటకు !

తే-గీ. తేనెతెట్టెను జెలరేఁపఁ దేనెటీఁగ
గములు వెడలెడిచందానఁ గాండపటలి
కుశశరాసన ముక్తమై గుమురుకొనుచు
దిక్కులీనిన యట్టులఁ దేజరిల్లె.

సీత.—బళీ ! కుశకుమారా, జనకున కనురూపుఁడవైన పుత్రుఁడవైతివి. మాండవ్యా తరువాత యేమైనది ?

మాండ.—

శా. రూపంబెత్తిన శౌర్యమట్టుల మహారుద్రాకృతిన్ సంగర
వ్యాపారోన్ముఖుఁడై కుశుండు ప్రదరవ్రాతంబుసంధింపగం
జాపంబుర్వికి జాఱ సైన్యపతి మూర్ఛావీతచేతస్కుఁడై
భూపర్యంకశయానుఁడయ్యె వనభూముల్ పట్ల స్వాసీకినుల్.

సీత.—ఆహా ! వీరమాతనైతినను నానందంబున నా యొడలెల్లఁ బులకరించుచున్నది. ముద్దుకుమారా, మొన్నటిదనుక నాయొడిలో నాడుకొనుచుంటివే యింతటి సమరకళాకౌశల మెప్పుడలవరచుకొంటివోయి !

చ. జనకుఁడు నీపరాక్రమము శౌర్యము బాహుబలంబు సంగరం
బునఁ జరియించునేర్పు శరముల్ పఱపించెడి తీరుగాంచినన్
గనులఁ బ్రమోదబాష్పములు కాల్వలుగట్టఁగఁ గౌఁగిలింపఁడే
తనయుఁడ రమ్మటంచని సుతా సుకృతంబటు లుండఁబోలదే !

మాండ.—అమ్మా అంతటఁ గుశుఁడు విజయకుతూహలియై సవనాశ్వము ముఖమున మెఱయుచున్న బంగారు పట్టను లాగికొని కుటీరమునకుఁ దరలుట కుద్యుక్తుఁ డయ్యెను.

సీత —(స్వగతము) నాయనా, ముఖపట్టమును విజయాంకముగఁ గైకొంటివా! (ప్రకాశముగ) అంతట.

మాండ.—అంతట సింహనాదములొనరించుచుఁ జెల్లాచెదరైన సైన్యములు నొక్క మొనఁదలపడి కుశుని చుట్టుముట్టినవి. ఇంతలో మూర్ఛితుఁడగు సేనాని తెప్పిఱిలి లేచి సేనలఁ బురికొల్పుచుండెను.

సీత.—(నిట్టూర్పుతో) అయ్యో! నాయనా యింకెక్కడి కుశుఁడు. ఒక్క బాలుని ఇంతసైన్యము పొదువుట వీరనీతియా?

మాండ.—అమ్మా అంతట కుశునియవస్థ చలిచీమలకుఁ జిక్కిన యురగ కిశోరము వలె నైనది. (దుఃఖించును)

సీత.—(దుఃఖముతో) నన్ను వంచించితివి. వంచించితివి. ఇంతదనుక కుమారుని శౌర్యవినోదమున మైమఱపించి యతర్కితముగ సత్యమును బ్రత్యక్షము గావించితివి. నాముద్దుకుమారా, రఘువంశకరీరమా, నాభాగ్యసర్వస్వమా అసహాయుఁడవై రణరంగమునఁ గూలితివా.

చ. శరములపోటుగంటుల నజస్రము నెత్తురు లూటకాల్వలై
తొరఁగి శరీరముం దడుప దుర్భరవేదన కోర్వలేక యు
త్తలఁగునఁ బల్లటిల్లి రణదేశమునన్ శయనించితో మనం
బెరియగ నన్నుఁ దమ్ముని నిఁ కెంతగలోఁ దలపోసికుందితో.

అయ్యో! కుశకుమారా, నాకన్నులవెన్నెలా, నన్నును నీముద్దుతమ్ముని విడనాడి పోయితివా! వాల్మీకినాయన వచ్చి కుశుఁడేడియన్న నేనేమి చెప్పుదును తండ్రీ! ప్రియతనూజా నన్నుఁగూడ నీతోడఁ గొనిపొమ్ము. (మూర్ఛిల్లును)

మాండ.—అమ్మా యూరడిల్లుము. నేఁబోయి లవుని దీసికొనివచ్చెదను. (నిష్క్రమించును)

సీత.—(తెప్పిఱిలి) నాయనా కుశకుమారా, ఒక్క నిమిషంబున లోకమెల్ల వెలిగించి మఱునిమిషంబున నస్తమించుసూర్యునివలె నయినదా నీబ్రతుకు. వాల్మీకినాయనగారుండిన సత్తపఃప్రభావమునఁ బునర్జీవిని గావించియుండునేమో గదా! అకటా! నాబోఁటి దురదృష్టవతికి సంతతి భాగ్యమబ్బునా. నాముద్దుకూనా పంచ్రెండువత్సరములకే నీకు శతాయుష్యము సంపూర్ణమైనదా.

సీ. పూర్ణిమా చంద్రుని బురణించు నీమోము
కళలెల్లఁదఱిగినే కన్నతండ్రి ;
కల్హారకులువోలు కన్నులు జిగిమాసి
మూతలు వడియెనే ముద్దుకూన ;
సువిశాలఫలకంబు సొంపుమీఱునురంబు
శోణితంబాలికెనే సుందరాంగ ;
ఆజానులంబమై యలరుదోర్యుగళంబు
బలము దొలంగెనే కలికి పట్టి ;

తే-గీ. ఆశలకునెల్ల నాలంబమైన నీవు
సంగర క్రోడశాయివై సమసినావె!
యిట్టి ప్రత్యక్షసత్యంబు నెఱిఁగియుండి
పగులదేమొ నాహృదయమ్ము బ్రద్దలగుచు.

అయ్యో! నాముద్దుబిడ్డా, నన్ను నట్టడవుల పాలుచేసి పోయితివా.

(లవుఁడును మాండవ్యుఁడును ప్రవేశింతురు.)

నాయనా నీముద్దులయన్నను గోల్పోయితిమి.

(లవుని కౌఁగిలించుకొని దుఃఖించును.)

లవు.—అమ్మా, యేమి వకచెప్పుము. గట్టివాఁడైన అన్నను కఱచెనా ?

సీత.—అయ్యో! నాయనా యది యజ్ఞాశ్వమఁట గదా.

లవు.—అయిన నేమి ?

మాండ.—అయిన నేమియా? అదియే ప్రాణాంతకమైనది.

సీత.—అశ్వరక్షకులు కుశునితోఁ బోరాడిరఁట.

లవు. ఏమీ అన్నను నొప్పించిరా ?

మాండ.—నొప్పించుటయా, కంఠగతప్రాణునిఁ జేసిరనుము. ఎవరికైన నంతపొగరు తగదు. అందులో తాపసార్భకు లెట్లుండవలయును?

సీత.—మాండవ్యా, ఇది నీతిబోధలకుఁ దరుణమా.

లవు.—ఏమంటివి ?—కంఠగతప్రాణునిఁ జేసిరనియా ?

శా. ఉన్నారా కుశునోంచువీరులు నృపవ్యూహంబునం దెచ్చటన్
విన్నామే పులిపిల్ల ముట్టి వృకముల్ పీడించి చెండాడుటల్ ?
గన్నామే యిటువంటివింత ? యయినం గానిండు ; నేఁబోయి మా
యన్నం దెత్తు రిపుప్రభేదనచణ వ్యాపారపారీణతన్.

మాండవ్యా నన్నాకదనరంగమునకుఁ గొనిపొమ్ము.

మాండ.—(స్వగతము) అయ్యో ! నాకే రావలయునా యీమహావిపత్తు. ముందుగఁ బోయి మొసలికిఁ జిక్కితిని. ఒక్క శిలీముఖము తప్పిదారి నాపైఁబడినఁ బ్రాణముల నూటికొనకమానదు. (ప్రకాశముగ) లవా యిట్టికార్యముల బాల్య చాపలము ఆపదలకు మూలమగును.

సీత.—నాముద్దుకూనా నీకేల యీదుర్బుద్ధి ? తారతమ్యమెఱుంగక పోరిన కుశకుమారుని గతి యేమైనది.

తే.గీ. చంద్రబింబమ్ము జలద సంఛన్నమయ్యెఁ ;
గాఱుచీఁకటి నల్లడఁ గ్రమ్ముకొనియెఁ ;
దారకలు మాసి యొక్కటే తార నిలిచె ;
నదియు మఱగిన గతియేమి యయ్యెనాకు.

లవు.—అమ్మా రోషాగ్నిజ్వాలల నానెత్తురు తుకతుక యుడుకుచున్నది. ప్రతిహింసావేశము నన్నుఁ బెరరేఁపుచున్నది. నన్ను వదలుము.

సీత.—నాయనా, నీముష్కరత చాలింపుము. కడసారి నాముద్దుకొమరుని మృతికళేబరమునైనఁ గాంచుటకు నన్నుఁ గొనిపొమ్ము.

లవు.—తల్లీ నీవు విచారింపవలదు. అన్న సర్వతోముఖబాణప్రయోగదక్షుఁడు. అతఁడు మరణించియుండుట కల్ల. అన్న మూర్ఛిల్లియుండిన భీతిల్లి కామాండవ్యుఁడు పరుగెత్తియుండును.

మాండ.—నీవుమాత్రము భీతిల్లకుందువా ? అప్పటికిని ధైర్యవంతుఁడను గావున దూరముననుండియైన నంతయుఁ దెలిసికొనివచ్చితిని.

లవు.—అమ్మా కాలవిలంబనమగుచున్నది. నన్నుఁ బోనిమ్ము.

(కౌఁగిలి విడిపించుకొనును)

సీత.—నాయనా, నామాటవినరా.

ఆ-వె. నాదుముద్దుకూన నాకన్నువెన్నెలా
నాదు భాగ్యరాశి నాకుమార
పుత్రశోకవహ్నిఁ బొగిలింపనెంచితే
రార కన్నతండ్రి రణమువలదు.

లవు.—అమ్మా యాకూశలకు అన్నయ్యను నప్పగించి నన్ను సుఖముండు మని యెదవా.

ఉ. అన్ననునొంచినట్టి యభియాతిబలంబులు చెట్టుపుట్టలన్
వెన్నడిమున్నడింబజవ భీషణసంగరమందు మబ్బులోఁ
జెన్నగు మించునామెఱసి చిందఱవందఱచేసి శౌర్యము
భ్యున్నతి నొందఁదెచ్చెద సహోదరు నీవు ముదంబుఁబొందగన్.

సీత.—మాండవ్యా, యిఁక నేనేమి సేయుదును. ఈలవుఁడు నామాట సరకు సేయకున్నాఁడు.

మాండ.—అమ్మా నీవు బ్రతిమాలినను విననివానికి నాసదుపదేశము చెవినిదూరునా?

లవు.— తే-గీ. తల్లి నీవైన వాల్మీకి తాతయైనఁ
దాపసేశ్వరులైన విధాతయైన
అన్న యవమానమునకు రోషాగ్నిరగులు
నన్ను నిలుపంగలేరని నమ్మువమ్మ.

అమ్మా యిఁకఁ బోయివచ్చెదను. మాండవ్యా రమ్ము.

మాండ —పోదము పద. (ఇరువురు నిష్క్రమింతురు.)

సీత.—(చేతులుజోడించి) అయ్యో! జగదీశ్వరా, యీముద్దుకుమారునైన రక్షింపవా.

ఆ-వె. సూర్యచంద్రులార! సురలార మునులార!
కన్నతండ్రులార గావరయ్య
యిలను నెల్లనేలు నిక్ష్వాకుభూపాలు
ముద్దుపట్టి నాదు ముద్దుపట్టి

(అవనిక జారును.)

## IV రంగము అడవి.

(కుశుఁడు మూర్ఛిల్లి యుండును.)

లక్ష్మణుఁడు.—కటకటా! నేనెంత యకార్యమొనరించితిని. క్రోధావేశమున నీఋషి కుమారుని ఈ శూరబాలకుని ఈసౌందర్యరాశిని నా శరఘటమ్ములకెఱ గావించితిని.

తే-గీ. సగముపూచిన యెఱ్ఱ లొద్దుగపురెమ్మ
గాలితాఁకున నేలను గూలినటులఁ
దూపుగంటుల నెత్తురు దొరఁగుచుండ
ధరణి నొడిలోనఁబవళించెఁ దపసి సుతుఁడు.

ఆహా! నాయవివేకమునకు నాకే లజ్జ వొడముచున్నది. ఋషికుమారుని దునుమాడినందుకు అన్న కోపింపకమానఁడు. ఈ కుమారుని దురవస్థఁగాంచినఁ దాపస దంపతులు నన్ను శపింపక మన్నింతురా?

ఉత్సాహ. చిగురుటాకు జొంపమందుఁ జిచ్చువెట్టి యవ్వలన్
వగలఁబొగులు మూఢునటుల బాలకున్ మనోహరున్
విగతజీవిగానొనర్చి వీరలోక మందునే
నగుడుగుడుతునంచుఁజిత్త మారటంబు నొందెడిన్.

ఆహా! యీతాపసబాలకునిపై నకారణవాత్సల్యము నాకేల గలుగుచున్నది. ఇది తపోవనమహత్వమా యేమి?

క. అరిదెగటారిన యందుకుఁ
బరగదు మోదంబునాదు భావమునందున్
బరమ సుహృన్మరణంబునఁ
గరముమ్మలికంబు నన్నుఁ గళవళపెట్టున్.

ఆహా! బాలకుని యవయవములు మెల్లమెల్లగఁ గదలుచున్నవి. శరాఘాతముల నీకుమారుఁడు మైమఱచి పడియుండెనేగాని దైవవశమున మరణింపఁడాయె. ఈ వీరకిశోరమును మాశిబిరమునకుఁ గొనిపోయి వ్రణచికిత్సగావించి యన్నకు ఉపాయనముగ అయోధ్యకుఁ బంపెదను. (కుశుని నెత్తి భుజముపై వైచికొనును.)

(లవుఁడు ప్రవేశించును).

లవు.— (స్వగతము) ఓహో! యీ రాజకుమారుఁడు అన్న నెత్తుకొని వెడలుచున్నాఁడు. (ప్రకాశముగ) ఓయీ! నిలుము, నిలుము. నీదొంగతనము సాగుననుకొంటివా?

తే-గీ. నేను మాయన్న వెంబడిలేనియపుడు
లెక్కయిడరాని సైనికు లొక్కమొగిని
పుట్టతేనెకు నీఁగలు మూఁగినటుల
ముట్టడించి వధించియుఁ బోవువారె.

లక్ష్మ.—(కుశుని నేలపైఁబరుండఁబెట్టి) (స్వగతము) ఔరా! యీ బాలకుఁ డెవ్వఁడు? ఈమూర్ఛితుని ప్రతిబింబమో యనునట్లున్నాఁడు. వీరిరువురు కవలైయుందురా?

లవు.—ఓయీ! శూరంమన్యుఁడా, మీ రాచవారి శూరత్వమిట్టిదియేనా? ఒక్క బాలకుని అందరు సైనికులుపోదివి తెగటార్చుటయేగాక అతని మృతకళేబరము సైతము దొంగిలించుకొని పోవుచున్నావా?

ఓయీ, ఆకళేబరమును విజయోపాయనముగఁ దలంచుము. అన్యోన్యజిగీషువులమగు మనలో నెవరు గెలిచినను ఆపారితోషకమును గైకొందము.

లక్ష్మ.—బాలకా నీవు ఋషికుమారునకు సోదరుఁడవా.

లవు.—నీకు నకాలమృత్యువును.

లక్ష్మ.—అంతరమెఱుంగక బాల్యచాపలమ్మున మాఱొక్కనిన యీ బాలునిగతి యేమైనదో చూడుము.

లవు.—(శింజినీటంకారము సేయుచు) ఇఁక నీగతి యేమికానున్నదో తెలిసికొనుము.

కుశు.—(మెల్లగఁగనువిచ్చి) తమ్ముఁడా నాకుఁ దోడ్పడవైతివా? మరణశయ్యాయందైన నొక్కమాఱు కౌఁగిలించుకొని నన్ను వీరస్వర్గమునకు వీడ్కొల్పవా!

లవు.—(విల్లుక్రిందవైచి) ఆహా! మాభాగ్యవశమున అన్న బ్రతికియున్నాఁడు. (దగ్గరకుఁబోయి మోకాలిపైవఁగి) అన్నా నిన్ను దురాత్ములునొప్పించిరా? నన్నేల ముందుగఁ బంపివైచితివి?

కుశు.—తమ్ముఁడా, నేనిప్పుడెక్కడ నున్నాను?

లవు.—రణరంగమున.

కుశు.—ఇంకను రాజకుమారుఁడు బ్రతికియున్నాఁడా!

లవు.—వీఁడుగో యజ్ఞపశువువలె బంధనమునకు సిద్ధముగనున్నాఁడు.

కుశు.—(చేతిపై సగముతేచి) ఏఁడీ?

లక్ష్మ.—(స్వగతము) ఔరా! ఏమి యీకుమారుని శౌర్యము!

మ. శరఘాతంబుల వేదనల్ సొలయుచున్ శార్దూలపోతంబు న
త్తురులొల్కంగ నగంబునెక్కి మృగయుం దుండాడ నుంకించె నా
శరవిద్ధాంగుఁడు బాలకుం డురుకుషా సంక్షుబ్ధచిత్తంబుతోఁ
బరగున్ బాపురె! వీరమోహన రణప్రావీణ్యరూపంబునన్.

కుశు.—లవా నావింటి నిటు లందియిమ్ము. (లవుఁడు అందియిచ్చును) (స్వగతము)
ఔరా! నాకరముల శరాసనభారము నైన నోర్వకున్నది. (వింటిని దిగవిడచును)

లవు.—(సింజినీటంకారము సేయును.)

(వాల్మీకి ప్రవేశించును).

వాల్మీ.—ఆహా! శాంతికిఁ దావలమైన తపోవనభూమి యార్ద్రశోణితపిశితంబులఁ
గళంకితమైనది.

లవు.—రాజకుమారా నీప్రాణములఁ గాచికొమ్ము.

తే-గీ. మాదుజనయిత్రి లోకసమ్మాన్యవృత్త 1
పూతచారిత్ర వీరప్రసూత యైన 2
తాతవాల్మీకి సత్తపోధన్యుఁడేని 3

వాల్మీ.—ఎవరు నన్నుఁ దలఁచుచున్నారు?

లవు.—అస్త్రమియ్యరె, 4

వాల్మీకి.—ఆహా! ప్రమాదము. విడువక యాఁగుమాఁగు. 4

లక్ష్మ.—మునిచంద్రమా లక్ష్మణుఁడు మ్రొక్కుచున్నాఁడు.

వాల్మీ.—కుమారా వర్ధిల్లుము.

కుశు.—(స్వగతము) లక్ష్మణుఁడా యితఁడు!

లవు.—తాతా, (వాల్మీకిని కౌఁగిలించుకొని) యీదురాత్ముని సేనలు అన్నను ముట్ట
డించి మూర్ఛిల్లఁజేసినవి. అన్నను బ్రదికింపుము.

కుశు.—తాతా, నన్ను శీఘ్రముగ వీరస్వర్గమునకు వీడ్కొల్పుము. ఈశరాఘాత వేదన దుర్భరమగుచున్నది.

వాల్మీ.—(స్వగతము) ఆహా! దైవఘటనాచిత్రము! (ప్రకాశముగ) నాయనా యూరడిల్లుము. నీవు వజ్రకాయుఁడవు కాఁగలవు.

లక్ష్మ.—(స్వగతము) ఏమీ వాల్మీకిమునీంద్రుల మనుమలా యీ వీరకుమారులు. ఆజన్మ బ్రహ్మచారికిఁ గుటుంబము కలదా?

వాల్మీ.—(కుశునిపైచేయిడి) నాయనా కుశా, (యొడలునిమురుచు) నీశరాఘాతము లన్నియు నిర్బాధకము లయ్యెడిని లెమ్ము.

లక్ష్మ.—(స్వగతము) ఆహా! తపోధనులమహాత్వము!

కుశు.—తాతా, సమయమునకువచ్చి నన్ను రక్షించితివి.

లవు.—అన్నా వేదన శమియించినదా?

కుశు.—లవా, తాతగారి తపఃప్రభావ మమోఘముగదా!

తే-గీ. చేతితోఁదీసివైచిన రీతిగాఁ
దూపుగంటులవేదన తొలఁగిపోయెఁ;
బూర్వ దోర్బలముత్సాహమును జెలంగెఁ;
దగుదునేనింక వైరి మర్దనముసలుప.

వాల్మీ.—కుమారా, యీపట్టుదలవదలుము. మాననీయులయెడ నపరాధ మొనరిం చితివి.

కుశు.—(స్వగతము) ఆహా! యేమి వాల్మీకితాతగారి పక్షపాతము.

వాల్మీ.—లక్ష్మణా, గొప్పప్రమాదము వాటిల్లినది. లోకవిఖ్యాతవీరులగు మీరలీ బాలురతోఁ బోరాడుట ధర్మమా?

లవు.—(స్వగతము) ఇంద్రజిత్సంహారకుఁ డగు లక్ష్మణుఁడా యాతఁడు.

లక్ష్మ.—మునికులతిలకా, మన్నింపవలయు. ఈకుమారకుల మనోహరస్వరూపములు నాహృదయమును గరుణార్ద్రితమును గావింపఁ బోరుట కిష్టపడక సవనాశ్వమును వదలుఁడని యెంత బ్రతిమాలుకొన్నను వీరు వినరైరి. నాప్రయత్నము సాగమి రఘుకులేశ్వరు ప్రతిజ్ఞ నెఱవేర్చుటకై అనిష్టముతోనైనఁ గదనము సలుపవలసి వచ్చెను.

లవు.—(స్వగతము) వాల్మీకితాతగారురాకుండిన నింతవఱకే ప్రతిజ్ఞ నెఱవేర్చియుందువు కాఁబోలు!

వాల్మీ.—నాయనా గతమునకుఁ జింతించిన లాభములేదు. ఈ తపోవనముఁ బ్రవేశించి మా కతిథులైతిరి.

లక్ష్మ.—మహాప్రసాదము.

లవు.—(కుశుని వంకతిరిగి) అన్నా మనల నొప్పించినదురాత్మునకు ఆతిథ్యమొసఁగవలయునా?

కుశు.—లవా తాతగారు ఆశ్రమధర్మములకు వెలియౌదురా?

వాల్మీ.—కుమారులారా! ఆశ్రమమునకుఁ జోదమురండు; అతిథిసత్కారధన్యుల మగుదము. (స్వగతము) దైవవశమున నేను సమయమునకు తీర్థయాత్రనుండి మరలి రాకున్న నెంతప్రమాదము వాటిల్లియుండునో.

(అందరు నిష్క్రమింతురు).

## V. రంగము వాల్మీకి ఆశ్రమము.

### (వాల్మీకి - సీత.)

వాల్మీ.—కుమారీ, ఈవిషయము చక్కఁగ నాలోచింపుము. ప్రజ లింతకుమున్నె తమ యవివేకమును దెలిసికొని పశ్చాత్తాపపడుచుందురు. పుత్రవతివి నిన్ను రామచంద్రుఁడు కన్నులఁ గప్పికొని స్వీకరించును.

తే-గీ. నేలనాలుగు చెఱగులు నేలఁజాలు
వీరవీరులు కుశలవుల్ వెలఁదినిన్ను;
అట్టికొమరుల సౌఖ్యంబు నరసియైనఁ
గాంతు సన్నిధిఁ గాలంబుఁ గడపుమమ్మ.

సీత.—నాయనా సర్వమెఱింగిన మీరే యిట్లాడుచున్న నిఁక నే నేమిపలుకఁగలను. ఆర్యపుత్రునకు నాకన్నను గుమారులకన్నను కీర్తియేగదా యాదరణీయము.

వాల్మీ.—కుమారీ, నిన్ను మరలఁ బరిగ్రహించుటవలన రామచంద్రుఁ డపకీర్తివంతుఁ డౌనని యెంచెదవా!

సీత.—ప్రజ లట్లు తలంతురు.

వాల్మీ.—అమ్మా లక్ష్మణునివలన నంతయు నెఱింగితిని. నిన్ను వనములకుఁ బంపి నందులకుఁ జనులు రామచంద్రుని తొందరపాటును దూలనాడుచున్నారఁట!

సీత.—అహా! యేమి లోకుల చిత్తచాంచల్యము!

తే-గీ. నోటికడ్డమాకయు లేక మాటలాడి
సత్యము నసత్యమెఱుఁగరు జడహృదయులు
గాలివీచిన యల్లల్లఁ గదలియాడు
కేతనాంచల మటువారి చేతమలరు.

వాల్మీ.—జానకీ జనసామాన్యము కర్ణధారిలేని నావవలె ముందువెనుకకుఁ ద్రుళ్ళింత లాడుచు అనేకవిధములఁ బోవుచుండును.

సీత.—నాయనా యశ్వమేధ మొనరింపసమకట్టిన యార్యపుత్త్రుఁడు నూతనముగ సహధర్మచారిణిని పరిగ్రహించి యుండునుగదా!

వాల్మీ.—బిడ్డా రామచంద్రుఁడు ఏకపత్నీవ్రతుఁడని యెఱుంగవా?

సీత.—అట్లైన సహధర్మచారిణి లేక యజ్ఞదీక్ష యెట్లు వహించును?

వాల్మీ.—నీ ప్రతిబింబమగు స్వర్ణమయవిగ్రహమె సహధర్మచారిణి యగునట!

సీత.—(ఆశ్చర్యముతో) ఏమి యీవింత. ఆర్యపుత్త్రుఁ డింతటికైనఁ దగియున్నాఁడు.

వాల్మీ.—శాస్త్రసమ్మతమని యెందరో ధర్మవేత్తలగు తాపసులుపదేశించినను ద్వితీయపరిగ్రహమున కియ్యకొనక నీప్రతికృతిగఁ గాంచనవిగ్రహమును నిర్మింపించి రఘుకులేశ్వరుఁడు దీక్షాకంకణము ధరియించెనఁట!

సీత.—(స్వగతము) ఆర్యపుత్త్రుని యేకపత్నీవ్రత మెల్లకాలము వర్ధిల్లుగాక!

వాల్మీ.—అమ్మా, రామచంద్రుఁడు నిన్ను విడనాడియుండుటవలన స్వస్థచిత్తుఁడు కాఁజాలఁడు.

తే-గీ. సిందుచూలాలి విడనాడ నేర్చెఁగాని
విరహతాపంబు రాముఁడు వీడలేఁడు;
పవలురేయును నిన్నెంచి పనవిపనవి
పాండురోగి విధంబునఁ బాలిపోవు.

సీత.—(స్వగతము) ఆర్యపుత్రునకు వినోదహేతువైన ఆ కనకవిగ్రహమునకున్ సంతాపకారిణి నగు నేనే దురదృష్టవతిని.

(కుశలవులు ప్రవేశింతురు.)

కుశు.—తాతా, మాపాఠముల నొప్పగించుకొనుము. మేము పూజాపుష్పములు గోయఁ బోవలయు.

వాల్మీ.—నాయనలారా, పాఠము లటుండనిండు. అయోధ్యాపతియొనరించు అశ్వమేధమునకు మన మాహ్వానింపఁబడితిమి. మనయందఱము నేఁడే రాజధానికిఁ బ్రయాణము కావలయు.

లవు.—తాతా, అమ్మకూడానా?

వాల్మీ.—అవును.

కుశు.—తాతా అట్లయిన మేము రామాయణకథానాయకునిఁ బ్రత్యక్షముగఁ జూడఁగలమా?

వాల్మీ.—నిస్సంశయముగఁ జూడఁగలరు.

సీత.—(స్వగతము) ఆర్యపుత్రుఁడు తమతండ్రి యని తెలిసిన ఈకుమారకు లెట్లు సంతసించువారోగదా!

లవు.—తాతా, అలక్ష్మణుఁడేమైన మాపై లేనిపోనికొంటాలు చెప్పునేమో.

వాల్మీ.—నన్ననుసరించు మీకు నేలాటిభయముండదు లెమ్ము.

లవు.—అట్లా రమ్ము. చక్రిగ ఉతికియాఁగవైచిన వల్కలములు ధరియించుకొని సిద్ధముగ నుందము. (కుశలవులు నిష్క్రమింతురు.)

వాల్మీ.—కుమారీ తాపసనివాసినుల యాశీర్వాదములు వడసిరమ్ము.

సీత.—అటులనే పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

వాల్మీ.—నే నిన్నిదినములఁ దలపోయుచుండిన కార్యము అపరిష్కృతముగ అశ్వమేధ సందర్శనమూలమున సిద్ధింప నున్నది. ఇఁకనైన రామభద్రుఁడు దారపుత్ర వంతుఁడై సుఖియించుగాక! (నిష్క్రమించును.)

---

## VI రంగము యాగమంటపము.

{ రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులును, రాజులును, మునులును, ప్రజలును కూర్చుండియుందురు. }

రాము.—(స్వగతము) అకటా! సర్వాంగనిర్వాణదాయిని యగు నా జానకిని మోసగించి యడవులకు వెడలించి కృత్రిమమగు కనకవిగ్రహముతోడ నే నియాగ

మంటపము నలంకరింపవలయునా? ఈసాహసము సీతాబహిష్కారమునకన్న హృదయభేదక మగుచున్నది.

వశి.—రామభద్రా కంకణము ధరియించికొమ్ము.

రాము.—(చేయిచాపును. వశిష్ఠుఁడు కట్టుచుండును.)

తే-గీ. అవనిజాతరాముని బహిఃప్రాణమనుచు
నెల్లరనుకొను సత్యంబు కల్ల యయ్యె;
నట్లుగాకున్న జానకి నడవి కంపి
పాపిరాముండు నింకను బ్రతికియున్నె.

వశి.—రామచంద్రా హుతాశనునకంజలిఘటియించి హోమకుండము రగుల్పుము.

రాము.—(ఉల్క చేతఁబట్టుకొని కుండముతప్పించి రగిలించుచు) (స్వగతము) సీతా విరహితమైన ఈ యశ్వమేధము నేనెట్లొనర్తును.

తే-గీ. నాదుగృహలక్ష్మి యర్ధాంగి నామనోల
తాంతమకరంద బిందువు చెంతనుండ
నన్యజన్మంబు నొనరించి యున్న నాకు
ధర్మపత్ని యయ్యె నిటఁ గుందనపుబొమ్మ.

లక్ష్మ.—(స్వగతము) శోకాకులితచిత్తుఁడగు మాయన్న యజ్ఞవిధుల సాంతముగ నొనరింపఁగలఁడా!

రాము.—(స్వగతము) జానకీ, నీకైయొనర్చిన అనన్యసాధ్యములగు సాహసకార్యములు నేఁడు నిష్ప్రయోజనము లాయెఁగదా.

సీ. నీవు లేకుండిన నిస్తుల బలశాలి
వాలిఁ జెండాడుట వమ్ముగాదె;
నీవు లేకుండినఁ బావని జృంభించి
వనధి దాఁటుటయు నిష్ఫలముగాదె;
నీవు లేకుండిన నిఖిల వానరసేన
యబ్ధిగట్టుట వ్యర్థ మానుగాదె;
నీవు లేకుండిన నిర్నిద్ర రణవీరు
రావణుఁ జంపుట రవ్వగాదె;

ఆ-వె. స్వార్థపరత నిన్ను సాధుచరిత్రను
జేతులారఁ గానఁ జేరఁద్రోసి
వెఱ్ఱిపట్టినటుల వెకలినై చింతింతు
గడచినట్టి దుష్ట కార్యమునకు.

(వాల్మీకి కుశలవులు ప్రవేశింతురు.)

వాల్మీ.—రామభద్రా మంగళ మగుగాక !

రాము.—మునీంద్రా, భవదాగమనమునఁ గృతార్థుఁడ నైతిని.

మునులు.—తథాస్తు. తథాస్తు.

రాము.—(స్వగతము) లక్ష్మణుఁ డెఱింగించిన సౌందర్యమూర్తు లీ యిరువురు వటువులై యుందురా ?

(సభలో గుజగుజలు.)

రాము.—మునీంద్రా, యీ తాపసవటువు లెవ్వరికుమారులు.

వాల్మీ.—వీరొక వనవాసిని బిడ్డలు.

లవు.—(జనాంతికము) అన్నా యీయజమానుఁడేనా రామాయణ కథానాయకుఁడు.

కుశు.—అట్లే తోఁచుచున్నాఁడు. తమ్ముఁడా యీ శాంతస్వరూపుని దర్శించినంతఁ దల్లినిగాంచినంత యనురాగ ముప్పతిల్లుచున్నది.

లవు.—అన్నా వాల్మీకితాత సత్యమేవర్ణించెను.

రాము.—మునీంద్రా యావనవాసిని యెవ్వతె ?

వాల్మీ.—ఎవ్వతెయో యొకగర్భిణి వనముల నిస్సహాయయై పరితపించుచుండ నే నాశ్రమమునకుఁ దీసికొనిపోయి కుమారీ నిర్విశేషముగఁ బోషించుచుంటిని.

రాము.—తాపసోత్తమా, యీనిర్హేతుకవాత్సల్యము మీ దివ్యచిత్తమున కనురూపమైనది.— తరువాత,

వాల్మీ.—కొన్నిదినముల కా సీమంతిని యీకవ బిడ్డలను బ్రసవించెను.

రాము.—(స్వగతము) ఆహా! యీ సుందరకుమారులఁ గాంచినప్పటినుండి నామనము పరిపరివిధములఁ బోవుచున్నది. అదియేలొకో వీరి ముఖమండలముల వై దేహీ పోలికలు పొడకట్టుచున్నవి. నాభ్రాంతియే యిట్లు తోఁపించుచున —
(ప్రకాశముగ) కుమారులారా. యిటురఁ

వాల్మీ.—(స్వగతము) వాత్సల్యబీజమా యంకురింపుమా.

కుశలవులు.—(అనుజ్ఞకై వాల్మీకితట్టుచూతురు.)

వాల్మీకి.—నాయనలారా, భయపడకుఁడు. రామభద్రుఁడు సర్వప్రజలకు జనక ప్రాయుఁడు.

కుశలవులు.—(రాముని వద్దికిఁ పోదురు.)

రాము.—(ఇరువురను రెండుచేతులఁ జేరదీసికొని) (స్వగతము) ఆహా! యేమి యీ యాశ్చర్యము!

ఆ-వె. ఈమనోహరాంగు లీముద్దుకొమరులు
నన్ను నంటినంత సన్ను తాంగి
జనకజాతహస్త సంస్పర్శమట్టులఁ
గాయమెల్ల నమృత కలితమయ్యె.

కుశు.—(స్వగతము) ఏమి యీమహాత్ముని తాపసాదరణము.

లవు.—(స్వగతము) తండ్రి కౌఁగిలినెఱుంగని నాశరీరము ఈ మహారాజుకౌఁగిట సుఖించుచున్నది.

రాము.—కుమారులారా మీ నామధేయము లేమి?

లవు.—మహారాజా యీయన కుశుఁడు.

కుశు.—రాజచంద్రా యీతఁడు లవుఁడు.

రాము.—(స్వగతము) ఎంత కఠోరసంబోధనములు.

వశి.—వత్సా, యిఁక యజ్ఞవిధుల గమనింపుము.

వాల్మీ.—నాయనలారా, మీ రిఁకరండు.

కుశలవులు.—(కౌఁగిలివదల్చుకొని వాల్మీకి దగ్గరకువత్తురు.)

రాము.—(స్వగతము) ఆహా! కౌఁగిలి వదల్చుకొనిపోవు నీబాలకుల నాచిత్తముకూడ ననుసరించుచున్నది. అగర్భవతియే సీతయయ్యుండిన—ఈ ముద్దుకొమరులే నా బిడ్డలయ్యుండిరి—ఆహా, యీ మందభాగ్యునియందు నియమాలన్నియు నిరర్థకములు.

(శూర్పణఖనీడ్చుకొని విభీషణుఁడు ప్రవేశించును.)

విభీ.—తే-గీ. ఓసికులపాంసనీ చండి యోసిజంత
నాకు సోదరివై పుట్టినావె నీవు?
కత్తికొక్కొక్క కండగాఁ గాయమెల్లఁ
దఱిగివైచినఁ బోనె పాతకము కుటిల!

లక్ష్మ.—దానవేశ్వరా, యాగమంటపముననా స్త్రీహత్య!

రాము.—విభీషణా, ఏమి యీ దౌర్జన్యము?

విభీ.—రఘుకులేశ్వరా, యీ మాయలమారిజంతను ఇప్పుడే శిరచ్ఛేదన మొనరించుట కాజ్ఞ యొసఁగవలయు. ఈశూర్పణఖయే నిగప రాధినియగు జానకీదేవి బహిష్కారమునకు మూలము. ఈ రక్కసి యొనరించినకుట్రలన్నియు నాకుఁ దెలియవచ్చినవి.

రాము.—(ఆశ్చర్యముతో) ఏమేమి?

లక్ష్మ.—(స్వగతము) ఇది యేమివింత!

రాము.—విభీషణా యీశూర్పణఖ యేమిచేసినది?

విభీ.—ఈ క్రూరచారిత్రయే తన దుష్టకృత్యమును దెలిపికొనుగాక.

(సభలో గుజగుజలు.)

శూర్ప.—దీనరక్షామణీ, ఆపద్బాంధవా, రామచంద్రా యీడఁ కురయ లాలింపుము. అనాథవత్సలా ఈ పాపాత్మను రక్షింపుము. నాతప్పు క్షమియింపుము. నన్ను బ్రతుకనిమ్ము.

భరతు.—(స్వగతము) ఈరహస్యము పూర్వమే తెలిసియుండిన జానకీదేవి యడవులకుఁ బంపఁబడి యుండదుగదా.

విభీ.—ఓసీ మాయలమారీ నీబొంకు లింకఁ జాలింపుము. సీతాపవాదకళంకము నీ హృదయ రక్తపూరమునఁ గడిగివేయవలయును.

శత్రు.—(స్వగతము.) శూర్పణఖ కుట్రయా యింతటికిం గారణము.

శూర్ప.—దీనబాంధవా, రామభద్రా యీ దీనురాలికి నభయప్రదాన మొసంగి రక్షింపుము.

తే-గీ. ప్రాణవల్లభుఁ జీకాకు పఱచినట్టి
కాకదైత్యుని సైతముఁ గాచినావు;
అఖిలలోక శరణ్యుండ వైన నిన్నుఁ
బ్రాణదానంబు వేడెద రామభద్ర.

లక్ష్మ.—అన్నా యీమాయావినియాదు వినరానఁదగదు.

రాము—దానవీ నీవెట్లు సీతాపవాదమునకు మూలమవైతివి?

శూర్ప.—మహారాజా, యథార్థము చెప్పుచున్నాను. నన్ను రక్షించినను శిక్షించినను మీ కరుణయె.

రాము.—చెప్పుము.

శూర్ప.—రాక్షసవినాశన ప్రతీకార మొనరింపఁగోరి జానకీదేవిని నెల్లైన నడవులఁ గష్టపెట్టనెంచి అయోధ్యఁ జేరితిని. మాఱువేసంబునఁ జరించుచు జనసమ్మర్ద

ములగు ప్రదేశముల ఏమేమొ యపవాదములు వ్యాపింపజేసితిని. రామభద్రా రక్షింపుము. రక్షింపుము.

ప్రజలు.—జానకీదేవి నిష్కలంక—సీతాదేవి సాధుచరిత్ర—

రాము.—(స్వగతము) ఓసీ క్రూరరాక్షసీ నీపగ తీర్చుకొంటివా.

విభీ.—మహారాజా, ఈకపటచారిణిని దెగటార్చుటకు ఆజ్ఞవెట్టుము.

శత్రు.—అన్నా, ఈరాక్షసి కరుణార్హ గాదు.

తే.గీ. నిందుమూలాలి వైదేహి నిష్ఠురంపుఁ
గష్టములకుఁ గారణమైన దుష్టురాలిఁ
గఱకు కఱవాలమునఁ జీల్చి కండలెల్లఁ
గాకులకు గ్రద్దలకు వైవఁ గౌతుకంబు.

రాము.—తమ్ముఁడా దీక్షాకంకణపూతమైన నాహస్తము అపరాధిని రక్తమందైన ముంపఁజాలను. ఈ కుటిలచరిత్రను హింసించినను నాప్రాణవల్లభ మరల బ్రతికివచ్చునా ? శూర్పణఖా వెడలిపొమ్ము. పాపపరీహారము గావించుకొనుము.

శూర్ప.—రఘుకులేశ్వరా నీయనంతకారుణ్యము వర్ధిల్లుగాక ! దారపుత్రవంతుఁడవై సుఖింపుము.

రాము.—(స్వగతము) జానకి జీవించియున్నగదా.—

ఋషులు.—రామభద్రా నీయతిలోకదయాళుత్వము ప్రశంసనీయము.

విభీ.—శూర్పణఖా రామచంద్రుని యాజ్ఞలేమి నీవు వధింపఁబడక బ్రతికితివి. ఇఁక లంకయందు దమగిడిన నాకరవాలము నీప్రాణముల నూటికొనును. పొమ్ము. నీపాపాత్రతరియించునటుల నెక్కడనైన వనమునందుఁ దప మాచరింపుము.

శూర్ప.—(స్వగతము) పులివాతఁబడిన జింకపిల్ల జాతి పడినటుల ఈ విభీషణుని చేతినుండి తప్పించుకొంటిని. ఇఁక నెక్కడికైనఁబోయి నా జీవితశేషమును గడపెద. (నిష్క్రమించును.)

వాల్మీ.—(లేచి నిలుచుండి) ఋషీశ్వరులారా, సకల దేశాధీశ్వరులారా, ప్రజలారా పవిత్రచారిత్రయగు జానకీదేవి శూర్పణఖమూలమున నడవులకు వెడలింపఁబడుట మీరెల్ల రెఱుంగుదురుగదా. నిందుమూలాలు—కోమలశరీర—రాజకుమారి నిస్సహాయయై యెట్లు కాలముగడపుచున్నదో యెవ రెఱుంగుదురు.

రాము—మునీంద్రా, హృదయ మర్మభేదకమగు నీవిషయము నేల తలపించుచున్నావు.

వాల్మీ.—ఆసాధ్వీమణి కష్టపరంపరలు విన్నఁ గఠోరచిత్తులైనఁ గంటఁ దడిపెట్టకుందురా ? ఇఁకఁ గరుణార్ద్రహృదయులగు మీమాటఁ జెప్పవలయునా ?

ప్రజలు.—వాల్మీకిమునీంద్రా, మహారాజ్ఞి దురవస్థఁ దలఁచినంతనే మాగుండెలవియ చున్నవి.

వాల్మీ.—అవునవును; అయోధ్యావాసులు సజ్జనులని నాకుఁ దెలియును.—సీత యన్ననో కదలమెదలలేనిగర్భవతి. వనమా ఘోరమృగాకులము. ప్రాణములు పిడికిటఁబట్టుకొని ఆ యబల యెంతకాలము జీవించియుండును ?

ప్రజలు.—కష్టము ! కష్టము !

మునులు.—సీత సుఖించుగాక !

రాము.—(స్వగతము) అయ్యో! యీమునీంద్రుని పలుకులుప్రేలుచున్న నా హృదయమునకు శల్య సంచలనములవలె నున్నవి.

వాల్మీ.—శూర్పణఖ తనదుష్కార్య మొప్పుకొనినవెనుక సభాస్థారులలో నెవ్వరైన సీతాదేవి బహిష్కారయోగ్యయని చెప్పఁగలరా ?

ప్రజలు.—మునీంద్రా, సీతాదేవి మాకుఁ గన్నతల్లివంటిది. జానకీదేవి పావనచరిత్ర—పతివ్రతామణి. దేవీబహిష్కారము ప్రమాదజనితము; ప్రమాదజనితము.

రాము.—(స్వగతము) ఈప్రజ లేగాలికి యాచాపయెత్తు స్వభావను గలవారు.

వాల్మీ.—సభ్యులారా, సీతాదేవి దైవవశమున బ్రతికియుండినఁ బునర్గ్రహణ యోగ్య యగునా ?

ప్రజలు.—నిస్సంశయముగ—ఈయశ్వమేధమున మహారాజునకు సీతాదేవియే సహధర్మచారిణి గావలయు.

రాము.—ఇది యెట్లు సంభవించును?

వాల్మీ.—వత్సా దైవఘటన కసాధ్యముగలదా ?

రాము.—(ఆతురతతో) ఆర్యా అట్లైయిన నాహృదయేశ్వరి బ్రతికియున్నదా ?

వాల్మీ.—కుమారా జానకి బ్రతికియున్నది.

(ప్రజలలో సంతోషసూచకసంభాషణలు, గుజగుజలు.)

రాము.—ఏమి వినుచున్నాను ? ఇది స్వప్నముగాదుగదా ?

ప్రజలు.—మహారాజా, మామనములు చల్లఁబడునటుల సీతాదేవిని పరిగ్రహించి సుఖింపుము.

వాల్మీ.—రాఘవా, నీకుఁ గుమారులుగూడఁ గలరు.

లక్ష్మ.—(స్వగతము) నాయూహ యథార్థమై యుండునా !

రాము.—ఆహా! యిదియేమొ మాయానాటకముగ నున్నది. మునీంద్రా యిదియంతయు నసంబద్ధము. నాకెక్కడిజానకి! యెక్కడికొమరులు ! సీతకును నాకును పండ్రెండువత్సరములు దుర్భేద్యకుడ్యమువలె యెడఁబాటు గావించినవి. ఇది యంతయు స్వప్నము—మృగతృష్ణాప్రాయము—యింద్రజాలము—ఈమంద

భాగ్యునికి భార్యలేదు, బిడ్డలులేరు, సోదరులులేరు, బంధువులులేరు. ఎవ్వరునులేరు. రామునకు లోకమంతయు శూన్యము; అంధకార మలీమసము; నరకసదృశము.

వాల్మీ.—రామచంద్రా యీ తీవ యుంగరము ధరియించిచూడుము.

రాము.—(ధరియించికొని కన్నులుమూసికొని) ఆహా! నాయర్ధాంగి! నాగృహలక్ష్మి! నా నయనానందసర్వస్వము! నాజానకి బ్రతికియున్నది. ఏకవేణీధారిణియై కృశాంగియై వల్కలములుధరియించి బాష్పపూరితనేత్రముల నన్నుఁ దిలకించుచున్నది. ప్రాణప్రియా నా స్వార్థపరత్వమును క్షమియింపుము. నాయపరాధమును నీ కృపాకటాక్షవీక్షణములఁ గప్పిపుచ్చుము. నాజీవితశేషమును నీ యభీష్టపాలనమునకై వినియోగించి యపరాధవిముక్తుఁడ నయ్యెదను. నాముద్దుబిడ్డలారా, కుశలవులారా, రండు నాయుత్సంగము నలంకరింపుఁడు. నన్నానందవార్ధి నోలలాడింపుఁడు. మీతల్లి నట్లు నట్టడవులఁ గష్టపెట్టితినని కోపింపకుఁడు.

కుశు.—(స్వగతము) ఇదియేమి మహారాజ ట్లనుచున్నాఁడు.

లవు.—(స్వగతము) మేము రామాయణకథానాయకుని బిడ్డలమా!

{ సభలో గుజగుజలు. వాల్మీకి మెల్లగా రామునిచేతినుండి యుంగరము తీయును. }

రాము.—(కన్నులు తెఱచి) ఇంతలో నాజానకి యేమయ్యె. నన్నెల యంతఃపురమునుండి యప్పుడే తీసికొనివచ్చితిరి. నాముద్దుకొమరు లేమైరి.

వాల్మీ.—రామచంద్రా, యీవటువులను నీకుమారులవలెఁ దలంచుకొనుము.

(కుశలవులను పట్టియిచ్చును.)

రాము.—వీరేనా నా ముద్దుకొమరులు. నాయనలారా రండు. నన్నుఁ గౌగిలించుకొనుఁడు.

లవు.—(స్వగతము) ఇంతవఱకుఁ దాపసబాలకుల మనుకొనుచుంటిమి.

రాము.—మునీంద్రా నాహృదయేశ్వరి యేది?

వాల్మీ.—అమ్మా జానకీ.

(సీతయు ఋషిపత్నియుఁ బ్రవేశింతురు.)

ఋషిపత్ని.—కుమారా, యీపతివ్రతాశిరోమణిని పరిగ్రహింపుము.

సీత.—ప్రాణవల్లభా, యీదీనురాలి యపరాధములను మన్నింపుము. (పాదములమీఁద వ్రాలును.)

రాము.—(లేవనెత్తి) హృదయేశ్వరీ నిరపరాధిని వనితెలిసియుఁ, గీర్తిలోభమున, మనసుకట్టి నిన్నుఁ గానలకంపిన యీపాపిరాముఁడు నిన్నుక్షమియించుట

కేవ్యఁడు. నీ యతి లోకపాతివ్రత్యము నీయనన్యసాధ్యమైన క్షమ మానంతము నుద్ధరించినది. మఱి లోకమా జీలోకమును నాకానందమయముగ నొనరింపుము. (స్వగతము) ఆహా! మానవుని సుఖదుఃఖావస్థల భ్రమణము!

తే-గీ. ఐంద్రజాలికుఁ డాత్మ మోహనపుఁగుంచె
విసరినంతనె మాఱెడి విషయములుల
నాకు నిరయంబుగాఁదోఁచు నాదుబ్రతుకు
స్వర్గ సన్నిభమయ్యె నీక్షణమునందు.

(ప్రకాశముగ) మునిసత్తమా నాకృతజ్ఞత నెట్లు దెలిపికొనుటకుఁ దోఁప కున్నది. ఇన్నిండ్లకొకమాఱు సపత్నికుని గావించితిరి.

వాల్మీ.—వత్సా, కష్టసుఖములు లోకమునకు సహజములు; అనివార్యములు. గడచినది మఱచిపొమ్ము. వర్తమానము ననుభవింపుము. భవిష్యత్తును దృష్టిపథమున నుంచుకొనుము.

ఋషులు.—రఘుకులేశ్వరా జానకీసహితుఁడవై యశ్వమేధము నొనరింపుము. పుత్రవంతుఁడవై గార్హస్థ్యసౌఖ్యముల ననుభవింతువుగాక.

ప్రజలు.—తల్లీ లోకమాత, అజ్ఞానుల మాపరాధముల మన్నించి మమ్ము మాబిడ్డలవలె రక్షింపుఁడు.

ఋషులు.— శ్లో॥ స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం,
న్యాయ్యేన మార్గేణ మహీంమహీశాః,
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం,
లోకాః సమస్తాః సుఖినోభవంతు.

(యవనికజాఱును.)

## భరతవాక్యం.

మ. నెలమున్మూఁడులు వర్షముల్ గురియుతన్ నీరంధ్రమేఘాళి స
స్యలతావృక్షచయంబు సత్ఫలయుతంబై క్షేమముల్ వాపుతం;
గలుగుంగాత స్వరాజ్యమెల్ల ప్రజకుం; గళ్యాణముల్ సౌఖ్యముల్
వెలయుంగావుత స్వర్గమున్మను బలె నీ విశ్వంభరన్ నిత్యమున్.

---

శ్రీరస్తు.

ఆంధ్ర సారస్వతలతానికుంజమున

అభినవ కుసుమగుళుచ్ఛములు.

# దువ్వూరు రామరెడ్డిగారి గ్రంథములు.

---

కృషీవలుఁడు రెడ్డికులప్రబోధము, అను పద్యకావ్యముల రచియించి (The poet laureate of the Reddy community) రెడ్లయాస్థానకవియని పేరువడసిన కవి యెవ్వఁడు ?

శ్రీ విజయనగర సంస్థానమువారిచే నెలకొల్పఁబడిన ప్రబంధ సమ్మానపరీక్షయందు 1918 సంవత్సరమున ప్రథమ బహుమానము గడించి యాంధ్రలోకమున ప్రఖ్యాతిగాంచిన కవి యెవ్వఁడు ?

నెల్లూరుపురమున సమావేశమైన చతుర్థరెడ్డి మహాసభయందు తత్సభాధ్యక్షులగు సాహిత్యవినోద కట్టమంచి రామలింగా రెడ్డి యం-యే. గారిచే బంగారు పతకముపొందిన కవి యెవ్వఁడు ?

## దువ్వూరు రామిరెడ్డి.

**ఈకవి గ్రంథములు మీరు చదివితిరా?**

ఇంతకుమున్ను చదువకున్న ఈక్రింది గ్రంథముల చదువుఁడు. ఆంధ్రసారస్వతమును పునరుజ్జీవింపఁ జేయుచున్న అభినవభావములను గనుఁడు. తెనుఁగుటలలోనాని సెలయేటిపాట !! మురళీనినాదము !! వల్లకీగానము !! వినుఁడు. ఆనందించుఁడు.

## వనకుమారి.

ఇదియే విజయనగర సంస్థానమువారిచే బహుమానింపఁబడిన నవీనపద్యకావ్యము. విచిత్రకల్పనము— మధురభావము— చెవికి నింపగుశైలి. వెల-0-12-0

ప్రబంధపరీక్షకులైన మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామశాస్త్రిగారు,

బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బరాయశాస్త్రిగారు, మ-రా-శ్రీ మొసమండ్ర నారాయణమూర్తి. బి. యే. గారును తాము వనకుమారిని బహుమానయోగ్యగ్రంధముగ నిర్ధారణసేయుచు దర్బారునందు చదివిన నివేదికలోని గ్రంథవిషయకమైన యీభాగమును పరికింపుడు. "వనకుమారియనుకావ్యము స్వకపోలకల్పితకథావిశిష్టమై స్వభావోక్తి ప్రధానమై మృదుమధురశైలిగలిగి నిరర్థకపదరహితమై కొన్ని పాశ్చాత్యప్రబంధమర్యాదలతో నలరారుచున్న శృంగారప్రబంధము. వర్ణనాంశములు కథాసందర్భమునకు లోబడి యపూర్వకల్పనాచాతుర్యమును వెల్లడించుచున్నవి. పాత్రౌచిత్యము చక్కగ పాటింపఁబడినది. రసౌచిత్యములకు ప్రతిబంధకములగు శబ్దాలంకారములు వర్జింపఁబడినవి."

మద్రాసు "హిందు" ఈ గ్రంథముపై ఈ యభిప్రాయము నిచ్చెను

"Vanakumari has an original plot......" The style of the poem is easy and flowing and is free from the pedantry and verbal conceits which are often the feature of Telugu poetical composition. The imagery about the woods is quite realistic and the character of the heroine is well maintained. The author is gifted with great power of imagination.

మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు ఈఅభిప్రాయ మొసఁగిరి.

అయ్యా, యుష్మత్ప్రణీతములయిన వనకుమారీ జలదాంగనా కృషీవల నామకగ్రంధములను పరికించితిని. వానియందు కవితాబీజమయిన ప్రతిభ నాకు గోచరించినది. శబ్దసౌష్ఠవప్రవణత్వముకూడ నగపడుచున్నది. కావున ఈమార్గమున మీకు కీర్తిగలుగునని నేను నమ్ముచున్నాను.

## కృషీవలుఁడు.

ఈకావ్యము ఆంగ్లేయవాఙ్మయమున నొక చక్కని గోపగీతము (Pastoral). స్వభావమధురమైన గ్రామవాసులజీవనము ఇందు భావ

గంభీరముగ వర్ణింపఁబడినది. విద్యావినోదులగు మ॥రా॥శ్రీ, కట్టమంచి రామలింగారెడ్డి యం. యే. గారు వ్రాసిన విపులమైన పీఠికగూడఁగలదు.

వెల 0-6-0

ఓరియంటల్ లయిబ్రరీ తెలుగుపండితులగు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయ మొసఁగిరి

"కృషీవలుఁడను పేర మీరు రచియించిన చిన్నకబ్బము చదివి చదివి సంతోషించితిని. తెలుఁగునాటి కాఁపుబిడ్డల పనిపాటలు పైరుపచ్చలు, సౌకుమార్యములు, స్వభావమధురముగ నంగా వర్ణించితిరి. తురుష్కుల జులుములు రాజపుత్రుల చిక్కులు మొదలగు వైదేశిక వస్తువులతోఁ గృతులను కూర్చువారెల్లఁ బ్రోత్సాహకమ్ముగాను మిమ్ము గొండాడుచున్నాను. ఆంధ్రదేశపు సదాచారసంప్రదాయములు లనదగు దేశిరచనల నలంకరించి, మీకవితాకన్యకున్న సహజసౌందర్యమింకను పెంపొందింతురుగాక యని కోరుచున్నాను."

The poem (Krishee valudu) is refreshing from the begining to the end on account of its original conception and new ideas. Most of the verses are strikingly melodious.

K. MALLIKARJUNACHARRY B. A.,
Deputy Collector,
Peddapuram.

" ఈ కృషీవలుఁడు...... చేనెగించి. ఇట్టివస్తువుగల కావ్యము తెలుగులో లేదు. కవనము తీరు మనోహరముగనున్నది. ప్రతిపద్యము సరసమై మంచిశయ్యలో పిరంచిస్వారముగ శ్రుతిహితముగ రచితమైనది.

నేలటూరు రామదాసయ్యంగారు. యం. యే, యల్. టి.,

## జలదాంగన.

వెన్నెలబయల పంటపొలమున విహరించుచున్న కవికుమారునకు జలదాంగన తన జీవితచరిత్రమును జెప్పికొనుట ఈ కావ్యములోని విషయము.

వెల రు.0-6-0.

"There is genuine poetry in this book (Jalathangana.)"
Rao Bahadoor G. Ramamoorthy B. A.,

"కవి మిక్కిలి ప్రతిభాశాలి. చక్కని భావములు. శైలియు నిగ్గుదీరియున్నది."

వేటూరి ప్రభాకరశాస్త్రి.

## స్వప్న ప్రయాణము.

ప్రపంచమునందంతటను మానవహృదయమును ప్రేరేపించు స్వాతంత్ర్యదృశ్యము ఈకావ్యమున స్వప్నరూపమున మూర్తీభవించినది. నవయుగప్రభాతమును దర్శించు ప్రతియాంధ్రుడును ఈకావ్యమును జదువవలయును.

వెల 0—6—0

## నలజారమ్మ యగ్ని ప్రవేశము.

ధర్మసూక్ష్మమునకై కొఱతవేయబడిన భర్తతోడ సహగమనము నొనరించిన యొక రెడ్డిపతివ్రత పవిత్రచారిత్రము ఈగ్రంథమున సరసముగ వర్ణింపబడినది. వెల 0—4—0

"కవిత్వము బాగుగానున్నది"

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

## నక్షత్రమాల.

ఇందు కవిగారు అప్పుడప్పుడు ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, ఆంధ్రప్రకాశిక, ఆంధ్రపత్రిక సంచికలలో ప్రకటించిన ఖండకావ్యములను సమకూర్చి ఈగ్రంథరూపమున ప్రకటించితిమి. ఇందు ప్రసిద్ధికెక్కిన స్వాతంత్ర్యరథము, కవితాప్రణయిని, మాతృపూజ మున్నగు పద్యములు గూడ చేర్పబడియున్నవి. కవిగారి భావోన్మేషణము, శైలిమాధుర్యము గనవలయునన్న ఈగ్రంథములోని (Lyrics) భావగీతములను జదువవలయును. వెల 0—12—0

వీరేశలింగ పుస్తకభాండాగారము,

కాపువీధి, నెల్లూరు.

అచ్చగుచున్నది !  అచ్చగుచున్నది ! !

త్వరలో ప్రకటింపఁబడును !  త్వరలో ప్రకటింపఁబడును ! !

# నక్షత్రమాల

కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రకాశిక, ఆంధ్రపత్రికా సంవత్సరాదిసంచిక, మున్నగు వానియందు దువ్వూరు రామరెడ్డిగారు అప్పుడప్పుడు ప్రకటించిన ఖండకావ్యములు ఈగ్రంథమున సంతరింపఁబడినవి. కవిగారి భావోన్మేషణము, వివిధ రచనాకౌశలము దెలిసికొనవలయునన్న ఈగ్రంథముఁ దప్పక చదువవలయును.

## విషయసూచిక



వీరేశలింగ పుస్తక భాండాగారము

కాపువీధి,

నెల్లూరు.